Regd No. N. 45 / M. 3813

౧౦౨౬౧

వెల ఒక అణా

గోలకొండ డైరీ
అయిపోవచ్చినవి
వెల ౧ రూపాయి

# గోలకొండపత్రిక

ప్రతి సోమ గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

హైందవుల పండుగలు
కర్త: సురవరం ప్రతాపరెడ్డి
౩౦౦ పుటలు, ౩౧ పటాలు
వెల ౧ రూ॥ మాత్రమే.
మేనేజరు గోలకొండపత్రిక

సంపుటము ౧౬ ★ హైద్రాబాదు, దక్కన్. శా. శ. ౧౮౬౩ వృషసం॥ర ఆశ్వయుజ బ॥ ౧ (౧౦-౧౦-౧౩౫౧ఫ.) సోమవారము ★ సంచిక ౪౩

# క్రిమియావద్ద ఘోరయుద్ధము

## బల్గేరియాకు జర్మనీ బెదరింపు

## బ్రిటను హెచ్చరిక—ఫిన్లెండు మౌనము

సెప్టెంబరు ౨౬వ తేదినుండి అక్టోబరు ౬వ తేదివరకు రష్యాతో జర్మనీచేయుచున్న యుద్ధమును గురించి వచ్చినవార్తలలో గొప్ప విశేషములేవియు లేవు.

ఉత్తరమున ఫిన్లెండు రంగములో మర్మాన్స్కుకు దక్షిణముగా ౧౩౫ మైళ్ల దూరములో తెల్లసముద్రమందు గాండలక్షా అఖాతములోని కొండలక్షనుఫిన్నులు పట్టుకొనినట్లు ఒక స్వీడను దేశపుపత్రికలో వార్త ప్రకటితమైనది. ఇట్లుఫిన్నులు తెల్లసముద్రము చేరినందువల్ల మర్మాన్స్కునుండి రష్యాకుపోవుమార్గము ఛేదించబడినట్లైనదని ఆవార్తతో వివరించబడినది— స్విర్ నదినుండి మర్మాన్స్కుకుపోవు రైలుమార్గము తమ సేనలవశమైనట్లు ఫిన్లాండువారు అక్టోబరు ౧వ తేదినాటికి ప్రకటించినారు— ఇందువల్ల ఇప్పుడు రష్యాలోని ఇతరభాగములనుండి మర్మాన్స్కు— కొందఅక్షప్రదేశముల కివరలోవలె సరకులు రైలుమార్గమున తెచ్చుటకు వీలులేకపోవుచున్నది. ప్రాతపడిన రెండుబద్దరోడ్లు మిగిలియున్నవి, అవి వర్షాకాలములో బాగుండవట— కారీలియా ముఖపట్టణమగు పెట్రోజావాడను ఫిన్నిషుసేనలవశమైనట్లు ఒకరేడియోలో ప్రకటించబడినది. ఈ ఫిన్నులవిజయములను నేటివరకు రష్యావారలు నిజమేనని చెప్పుటలేదు. బాల్టికు సముద్రంలో ఓసెల్ దీవి ఇంకనుతమవశములో నున్నట్లే రష్యావారనుచున్నారు.

ఇక లెనిన్గ్రాడురంగము. ఇక్కడరష్యాసేనలు మాదికి శత్రువునచ్చుచుండ ప్రతిక్రియ చేయుచుండుటతో తృప్తిపడగా స్వయముగా ముందుకు యాత్రచేసి క్రియచే చేయుచున్నవి. ఈవిధముగ రష్యనులు సెప్టెంబరు ౨౫వ తేదిన లెనిన్గ్రాడును ముట్టడించుచున్న జర్మనుసేనలను ౫ మైళ్లముందుకునెట్టుకొనిపోయి రెపెద్దగ్రామములను పట్టుకొనిరి—సెప్టెంబరు ౨౮వ తేదినాటికి “ఎల్”అను సంకేతముగల ఒకపట్టణమునుండి జర్మనుసేనలనుతరిమివేసినారు. మరియు ఆనాటికి లెనిన్గ్రాడునుండి ౧౨౦ మైళ్ల దూరమునందుండు నోవోగ్రాడుకు ఒక మైలుదూరంలోకి రష్యాసేనలుచేర్పబడెను. ఇక్కడ ఓల్ఖావునదితూర్పుతీరము రష్యావారివశములోనున్నది—ముల్గోవునది తూర్పుగట్టున రష్యాసేనలు స్థానికమేర్పరచుకొన్నవి ౨౯వ తేదినాటికి ఒకచోట ఒకదానివెనుక నొకటిగా నిర్మితములైయుండిన మూడుదుర్గశ్రేణులనుండియు జర్మనులు తరిమివేయబడిరి. ౨౯వ తేది మరికొన్ని స్థలాలను రష్యనులు పట్టుకొన్నారట.

లెనిన్గ్రాడుకు దక్షిణముగా ౧౨౫ మైళ్ల దూరంలో ఇల్మెన్ సరస్సుదగ్గరనున్న స్టారాయారుస్సా ప్రాంతములో రష్యనులకు రక్షణాలు చాల ముఖ్యకీలకస్థానమగు ఒకకొండయుచిక్కినట్లు ఒకరష్యాదేశీయ పత్రికలో అక్టోబరు ౨వ తేదిన ప్రకటించబడినది—కాని ఈవిధముగా రష్యనులు పట్టుకొన్నస్థలాలపేర్లు నిర్దేశింపబడలేదు— మొత్తముమీద అక్టోబరు ౨వ తేదినాటికి జర్మను సేనలు కొన్నిచోట్ల లెనిన్గ్రాడుసమీపమునకు వచ్చిచేరినవి—లెనిన్గ్రాడువద్ద పోరాటము ప్రారంభమైనది మొదలు ఇంతవరకు ౬వారాలలో కలిసి చావులును, బందీకృతులునుకలసి జర్మనుసైనికుల సంఖ్య ౧౫౦౦౦౦ వరకు ఉండియుండునని రష్యావారలు అంచనావేసినారు— యుద్ధసామగ్రికూడ జర్మనులది ఆహారముగా రష్యనులకు చిక్కినదట—

ఇక మధ్యరంగసమాచారము. ఇక్కడ ౨౫౦ మైళ్లపొడుగున జర్మనుసేనలు మాస్కోపై చేయదలచిన దాడినిరష్యాసేనలుఫలించనీయలేదు. సెప్టెంబరు ౨౮వ తేదినాటికి రష్యనులు ఇక్కడ లెనిన్గ్రాడురంగంలోవలె చేయుచున్న ఎదురుయాత్రవల్ల ఇదివరకుతామాక్రమించినట్టి ఎల్నియాకు కొంతదూరమునన్నున్న ౧౬గ్రామములను ఆక్రమించగలిగిరి.

యుక్రెయినురంగములో నీపర్ నదికి పడమట ఖార్కోపుకుపోవు మార్గములో నుండు పోల్టావా పట్టణమును రష్యాసేనలు ఖాళీచేసినతర్వాత జర్మనులు దానినిఆక్రమించినట్లు అక్టోబరు ౧వ తేది వార్తవచ్చినది—ఇప్పుడు ఇక్కడినుండి రష్యాలోని గొప్పపారిశ్రామికప్రదేశమగు డోనెట్జు ప్రాంతమునకుపోవుట జర్మనులకు సులభమగును—

నీపర్ నదిఎవరుఒడ్డును దాటుటకు జర్మనులుచేయుచున్నప్రయత్నములను రష్యనులుసాగనీయకుండ ఎదురుయాత్రలుకూడ చేయుచున్నారు. ఇంతలో యుక్రెయినులో వర్షములు మొదటిసారిగా అక్టోబరు ౨వ తేదిన పడినవి.

ఒడెస్సా రంగములోకూడ రష్యనులుఎదురుదాడిచేసి ఒడెస్సానుముట్టడించుచున్న రుమేనియా సేనను వాయువ్యదిశగా తరిమివేయుచున్నారు, నీస్టర్ నదిముఖద్వారమువద్ద కర్మాన్సీ, ఎయిగిజ హీము అనుస్థానములు రష్యావారివశమైనట్లు సెప్టెంబరు ౨౯వ తేదిన వార్తవచ్చినది

నీపర్ నదికి ౭౫ మైళ్ళదూరంలోఉన్న క్రిమియానుపట్టుకొనుటకై సెప్టెంబరు ౨౮వ తేదిన జర్మనులుప్రారంభించిన యాత్రయింకను జరుగుచున్నది. క్రిమియానుపట్టుకొనుటకై పెరికోపుఅనే భూఖండమునుపట్టుకొనవలసియున్నది. మొట్టమొదట అభూసంధిద్వారా క్రిమియాలోసేనలను జర్మనులుపంపజూచిరి కానితర్వాత విమానముల ద్వారా కిమియాలో యాకటోరియాను ఓ థియొడేషియావరకుగలస్థలాలలో జర్మనులు సేనలనుదింపుచున్నారనివార్త సెప్టెంబరు ౨౭వ తేదిన వచ్చినది పెరికోపుభూపరిరక్షణలను సగముదూరముఛేదించి చొచ్చుకొనిపోయినట్లు అక్టోబరు ౩వ తేదిన జర్మనుప్రకటించిరిగాని, రష్యావారలు అదినిజమేనని ఒప్పుకొనుటలేదు క్రొత్తగావచ్చినవార్తలవల్ల క్రిమియాలో యుద్ధము చాలఘోరముగా జరుగుచున్నట్లు తెలిసినది,

క్రిమియానుపట్టుకొని తర్వాతనెమ్మదిగా కాకేసస్ప్రాంతములోఉండే రష్యావారిపెట్రోలు గనులను పట్టుకొనుటకు జర్మను లపోవచ్చునను ఆలోచనతో కాకేసస్ వద్ద జర్మనులనెదుర్కొనుటకు ఏవిధముగా రక్షణలు చేయవలెనని రష్యా సైన్యాధికారులు బ్రిటిషుసైన్యాధికారులతో కలిసి ఇరాన్ప్రధానగరమగు టెహరానులో ఆలోచించిరి. ఆలోచనసభకు భారతదేశపుసర్వసేనానియగు వేవెల్ గారుపోయిరి. వీరు సెప్టెంబరు ౨౮వ తేదిసాయంత్రం అక్కడికిచేరిరి. రెండుమూడురోజులుండి తిరిగివచ్చిరి.

రష్యాయుద్ధరంగానికి జర్మనుసేనల సహాయార్థము రుమేనియనులను, బల్గేరియనులను, ఇటాలీయులను హిట్లరుచాలా ఒత్తిడిచేయుచున్నాడు. ఇటలీనుండి కొన్ని సేనలుపంపబడినవట. ఫ్రాన్సునుండి సేనలను, బహుపత్రికలను తెచ్చుచున్నారు. ౧౫౦౦౦౦ సేనను బల్గేరియావారలను, ౧౫౦౦౦౦ సేనను హంగేరీవారును, ఒకలక్ష సేనను రుమేనియావారును, ఒకలక్ష సేనను స్లొవాకియావారును ౫ లక్షలమంది ఇటాలీయులును రష్యాయుద్ధరంగమునకు జర్మనులకుతోడ్పడుటకై పంపించవలెనని జర్మనులుకోరుచున్నారట.

### బల్గేరియాపై జర్మనీఒత్తిడి

బల్గేరియావారు జర్మనులసహాయార్థము రష్యాయుద్ధరంగానికి సేనలనుపంపించుటయేగాక బల్గేరియా రేవులను జర్మను లుపయోగించుకొనుటకును, బల్గేరియాసముద్రతీరమందలి వార్నా, బర్గోసు రేవులలో యుద్ధసన్నాహములు చేయుటకును, నల్లసముద్రంలోని రష్యానౌకాదళములపై దాడి చేయుటకు బల్గేరియాలోని విమానభూములను ఉపయోగించుకొనుటకును ఒప్పుకొనవలెననియు జర్మను లుకోరినారట, ఇందుకు అంగీకరించనిచో బల్గేరియా జర్మనీతో చేసికొనియుండిన ఒడంబడికను భగ్నముచేసినట్లుభావించి బల్గేరియాను వెంటనే ఆక్రమించుటయగునని జర్మనులు బెదరించుచున్నారట బల్గేరియాలోని కొన్ని జిల్లాలలోజనులు రష్యాలో యుద్ధము చేయుటకు బల్గేరియా సేనలను పంపించుపద్ధతికి అసమ్మతి సూచించుటకై అల్లరులుచేయుచున్నారట. ఈ అల్లరులనణచుటకు ఇటాలీయ సేనలు పంపబడినవి. బల్గేరియాలో ధాన్యమంతయు జర్మనీకిచేర్చబడుచున్నది. బల్గేరియాలోని పరిశ్రమలపై జర్మనుల అధికారము హెచ్చించబడినది

### తుర్కీపై జర్మనీఒత్తిడి

తుర్కీపైకూడ జర్మనీ ఏదోఒక ఒత్తిడిచేయుచున్నట్లు కనిపించుచున్నది ఒక వాణిజ్యపు ఒడంబడికను తుర్కీతో చేసుకొనుటకై జర్మనీయత్నించుచున్నది. ఈవిషయమైన సంభాషణలలో తుర్కీవారు బ్రిటనుతోచేసికొన్న ఒడంబడికవల్ల క్రోమును జర్మనీకిఅమ్మజాలమని తెలిపినారట. కాని ఇప్పుడిప్పుడేవచ్చిన వార్తలవల్ల నేడో రేపో ఒడంబడికమీద తుర్కీ జర్మనుప్రతినిధుల సంతకాలుజరుగునని కనబడుచున్నది

### బ్రిటిషు హెచ్చరికకు ఫిన్లెండుమౌనము

౧౯౩౯లో ఫిన్లాండు రష్యాలమధ్యసరిహద్దుగానుండిన గీతవరకుగల ఫిన్నిషుసేనలు ఆక్రమించుకొన్న రష్యాప్రదేశములను ఫిన్నులుఖాళీచేసి రష్యాతో యుద్ధమును విరమించవలెననియు లేనిచో యుద్ధము జరుగుచున్నంతకాలమున్ను యుద్ధానంతరము శాంతిస్థాపనకాలములోను ఫిన్లెండును తన శత్రువుగా భావించుటయగుననియు బ్రిటను ఫిన్లెండుకు హెచ్చరికచేసినది దానికి ఫిన్లెండు సాంతించక మౌనమువహించియున్నది.

### రష్యా, జెకోస్లోవాకియాల ఒడంబడిక

రష్యా, జెకోస్లొవాకియాల ప్రభుత్వములు పరస్పరసైనికసహాయపు టొడంబడికను చేసుకొన్నట్లు సెప్టెంబరు ౨౮వ తేదిన వార్తవచ్చినది దీనివల ఒక జెకొస్లోవాకీయసేన రష్యాకుసహాయముగా యుద్ధముచేయగలదు

### మాస్కోలో మూడు రాజ్యాల ప్రతినిధుల ఆలోచనలు

రష్యాప్రధానగరమగు మాస్కోలో బ్రిటను, అమెరికా, రష్యాప్రభుత్వముల ప్రతినిధులు సెప్టెంబరు ౨౯వ తేదిన రష్యావిదేశాంగమంత్రియగు మొలొటోపుగారి అధ్యక్షతనసమావేశమైరి రష్యా సైన్యముయొక్కయు, నౌకాదళముయొక్కయు, విమానదళముయొక్కయు అవసరములనుగురించియు, ఆవసరములైనవస్తువులు బ్రిటను అమెరికాలనుండి పంపుట, రవాణామార్గములనుగురించియు, రష్యాకు అవసరమగు ముడిపదార్థములను, చికిత్సాసామగ్రినిగురించియు వేర్వేరుగాఆలోచనలు చేయుటకై ఆరుఉపసంఘములు నియోగించబడినవి,

అక్టోబరు౧వ తేదితో ఈసమావేశముముగిసినది. రష్యాసైనికాధికారులు, సివిల్ అధికారులు కోరినవస్తువులన్నిటిని ఇచ్చుట కునిశ్చయించబడినది బ్రిటను, అమెరికాలకుఅత్యవసరముగా కావలసినముడిపదార్థములనన్నిటిని రష్యాప్రభుత్వము ఇచ్చుటకుఅంగీకరించెను.

### రష్యాకుటాంకుల అవసరము

రష్యావారిటాంకులలోకములు యుద్ధంలో నాశనమైనందువల్ల, అనేకముఖ్యపారిశ్రామిక ప్రదేశములు రష్యానుండిజర్మనులవశమైనందువల్లను రష్యాకింకటాంకులను అన్నిదేశాలవారలును సహాయముచేయవలసిన అవసరము ఏర్పడినదని బ్రిటనులోని రష్యారాయబారియగు మెయిస్కీగారు సెప్టెంబరు ౨౬వ తేదిన బ్రిటిషుప్రజలకు బ్రాడ్కాస్టుచేసినబ్రాడ్కాస్టు ఉపన్యాసములో తెలిపినారు,

### చీనా, జపానులయుద్ధము

ఒకపక్షంరోజులకింద చైనాలోని హూనాను రాష్ట్రప్రధాననగరమగు చాంగ్షాను పట్టుకొనుటకు జపానీయసేనలు చేసినదండయాత్ర తుదకు అపజయమొందినట్లు తెలియుచున్నది. జపానీయసేనలు చాంగ్షాకుఉత్తరమున ౨౩ మైళ్ళదూరములోఉన్న కౌచియాపును సెప్టెంబరు ౨౫వ తేదిపట్టుకొని సెప్టెంబరు ౨౭వ తేదిసాయంత్రము చాంగ్షానగరమును ప్రవేశించినట్లు జపానువారు ౨౭వ తేదినప్రకటించిరి సెప్టెంబరు ౨౮వ తేదిన చాంగ్షాకు ౩౦ మైళ్ళదూరములో చేకియాంగ్ కును, కియాంగ్సీకును, హాంకో కాంటన్ రైల్వేకును మధ్యనున్న మానోపట్టణమును జపానీయసేనలుఆక్రమించినట్లు ఒకజపాను వార్తాసంస్థవారు ప్రకటించిరి మానోఆక్రమణవల్ల కాంటన్—హాంకో రైల్వేను ముఖ్యస్థలమందు చీలదీసినట్లగును కాని చైనావారుచాంగ్షాగాని, మానోగాని జపానీయులకుచిక్కలేదని సెప్టెంబరు ౩౦వ తేదినప్రకటించినారు. తుదకుజపానీయులు చాంగ్షాపట్టణమును పట్టుకొన్నఉద్దేశ్యము తీరినందువల్ల తమసేనలు దానినిఖాళీచేసినవని అక్టోబరు ౧వ తేదిప్రకటించినారు అక్టోబరు ౧వ తేది నాటి చైనీయవార్తలలోమాత్రము చాంగ్షానగరానికి ఉత్తరమున చైనాసేనలు ౫౦ వేలజపానుసైనికులను పూర్తిగాముట్టడించి ఒత్తించినట్లును ఆందువల్లజపానుసేనలుఓడినట్లును, తప్పించుకొన్న సేనలు ఉత్తరదిశకుపారిపోయినట్లును తెలుపబడినవి. చాంగ్షాసమీపగల ఆకాశయోధులను చైనావారుపట్టుకొనిరి.

కాంటను—హాంకో రైల్వే”వెంటదక్షిణముగా నెట్టుకొనివచ్చుచుండిన జపానీయవాహినిని చైనీయులు విజయవంతముగాఅడ్డగించుచు పోరాడిరి. కాని పెద్దగస్తాలోనై బు తగ నడచుచున్న యరోక జపానీయసేనయు, రైల్వేకు రష్యాకుమధ్య కొ పలద్వారాపడనుచున్న జపానీయసేనయు త్వరితముగాముందుకుపడచిపోయినవి. పింకియాంగు సమీపములోమిలోనది ఉత్తరగట్టు వైపునను, కోమైనగ్గరను పోరాటము తీవ్రముగా జరిగినవి కియాంగ్సి రాష్ట్రముఖ్యపట్టణముకు మాంచాంగు, హూనాపట్టణాలదగ్గర చైనాసేనలు ప్రతిఘటన సాగించినవి

తుదకు క్వాంటంగ్ రంగమునుంచికూడా జపానుసేనలు ఖాళీచేయవలసివచ్చెను. దక్షిణదిశన దాడియు ఫలించెను. చైనావారలు ఉత్తరనదిగట్టున కొన్నిస్థానములను, తూర్పువైపున రైలుమార్గములో కొన్నిస్థానములనుపట్టుకొనిరి, జపాను సేనలు దక్షిణదిశకు కాంటన్ వైపుగాపారిపోయినవి, మిలో, లోటోనదులమధ్య ఒకలక్ష జపానుసేన చైనీయులచే బాధితమయ్యెను.

చాంగ్షావద్ద చైనీయసేనల విజయమునకై చైనాప్రజలు వేడుకలుచేసికొనుచున్నారు.

ఇప్పుడు అమెరికానుండి సైనికరాయబారవర్గమొకటి చైనాకుపోవుచున్నది.

### అన్ని దేశాలనుండి జపానీయులఖాళీ

యూరపుఖండంలోఉండే జపానీయులందరును రాజకీయాధికారస్థులతప్ప ఈఅక్టోబరు నెలలో జపానుదేశానికిచేర్చుకొనబడుదురట. ఇప్పుడు ఇండియా, ఆఫ్రికా, సమీపప్రాచ్యదేశము నుండి ౩౦౦ మంది జపానీయులు జపానుకుగానిపోబడుచున్నారు ఫిలిప్పైనుదీవులనుండికూడ జపానీయులు ఖాళీచేయబడుచున్నారు

జపానునుండి ౩౦౦ మంది బ్రిటిషువారుఖాళీచేయబడుచున్నారు.

ఒకబ్రిటిషు పత్రికవిలేఖరి జపానుఅధికారంలోఉన్న ఒకచోటనివసించుచుంట అతనినతి హాయముగానుగూర్చి బ్రిటిషువారు జపానుప్రభుత్వమును బాధించుచుండిరిగదా! ఇప్పుడు అతడు చిక్కినట్లువార్తవచ్చినది కాబట్టి ఆ ఆందోళన చల్లారినట్లే

### అమెరికా వ్యవహారములు

క్రొత్తగానిర్మింపబడిన మాసాచూసెట్సుఅను యుద్ధనావకు సెప్టెంబరు ౨౬వ తేదిన ప్రారంభోత్సవముజరుపుచు అమెరికానౌకాదళ కార్యదర్శులగు కర్నల్ నాక్సుగారిట్లు ప్రసంగించిరి:—

“అమెరికా సంయుక్త రాజ్యముల భద్రతకు కట్టుబడ్డాము ఆ సవాలును వెంటనే రద్దుచేయవలెను.

శత్రువుతో పోరుచున్న దేశములకు మనము అత్యధికముగా సహాయముపంపినచో అవిశత్రువును ఓడించగలుగును అప్పుడు మనకుభయముండదు. యుద్ధమున్ను మనదేశమువరకు రాదు. మనసరకుల నావలలో సామగ్రులనెక్కించి ఇతరదేశములకు సహాయార్థముపంపుటకు మాకు అల్లుగారికి మన మధికారమొసగవలెను.

బహుశః ఈమాసాచూసెట్సు యుద్ధనావ యుద్ధములో పాల్గొనవలసివచ్చును.

అమెరికాకును బ్రిటనుకును మధ్యనున్న సముద్రమార్గమును శత్రువుఅడ్డుకొని రెండుదేశముల మధ్య సంబంధములేకుండచేయు ప్రయత్నము సాగనీయకుండచేయు పని అమెరికానౌకాదళమునకు ఒప్పచెప్పబడినది—అది అపనిని తప్పక నిర్వహించును.

అమెరికా సంయుక్తరాజ్యములో విమానాల పెట్రోలునుశుద్ధిపరచుశక్తిని మూడింతలొనర్చుటకు ౧౫౦ లక్షల డాలర్లఖర్చుతో ఏర్పాట్లు ఆలోచించబడుచున్నవని దేశీయమంత్రి ఇక్కుస్ గారు తెలిపిరి. ఇప్పుడుదినమునకు ౪౦ వేల పీపాలు శుద్ధిచేయబడుచున్నవి దినానికి ౧౨౦౦౦౦ పీపాలుతయారుచేయవలెను

ప్రస్తుతపరిస్థితిలో కార్పొరేషను లాభములు నూటికి ౬ కంటె హెచ్చుగానుండకూడదని నియమించుబిల్లును ట్రెజరీనిపుణులు తయారుచేస్తున్నారట.

వర్తక నావలు ప్రమాదప్రాంతాలకువెళ్ళవలసివచ్చినప్పుడు వాటినిసాయుధమొనర్చుటకు శాసనములు కావలెనని నౌకాదళనిపుణులు కోరినారు.

### స్వతంత్ర ఫ్రెంచి సంఘము

ఫ్రాన్సులో గాజ్యాంగశాసనము ప్రకారము సక్రమమైనప్రభుత్వము స్థాపింపబడునంత వరకు

౧౦ వ. పేజీ చూడుడు

## కన్యాక్రయము

(ఒకవిలేఖరి)

బందవరం (తా॥ సిద్దిపేట) ౧౯-౧౨-౫౦ ఫ.

సిద్దిపేట తాలూకాలోని బంగవరమునకు ఒక మైలుదూరమున అంకిరెడ్డిపల్లెలో టి శివరాజము అనువైశ్యుడు (బిటిషిండియాలో, గుంటూరునుంచి తుల్సీబాయిఅను ౧౪ సం॥గల తోమటిపిల్లను రూ. 300 కల్దారులకు కొనితెచ్చినాడు. అక్రూడఒకవయసుకుని చూపి వయడు ఈరీ గని వ్నాడని చెప్పినాడట. తుల్సీబాయి అంకిరెడ్డిపల్లెకువచ్చే వరకు శివరాజముకుమారుడు రామరాజేశం అదే రీతిగాఇంట్లోకగపించినాడు. తర్వాత అగ్నిమాజరిగినది తెజగామ గాలయ్యశ్రేష్ఠి కన్యాదానముచేసినాడు. కానివరుడు ఒకకునూపి, ముసలి శివరాజముతమ్ముడు అనంతంఅయినాడు— అందుగురించి తుల్సీబాయి రామరాజేశమే నాభర్తగాని ఈతడుకాడని పుస్తెతెంపివేసినది. ఒకమాపము మట్టుకు ఇదేచర్చజరుగుచుండెను— దీనినిగురించి రామరాజేశమును శెత్రిశెంట్రులు (పెంటర్స్) గౌరిగించి ఇతరగ్రామమునకుతోలించినారు— కాబట్టి తుల్సీబాయి చాలాచింతతోండ భర్తతో కాపురముచేయక రామరాజేశముతో వివాహముచేయండి, లేక ఇతరులకునన్ను అమ్మండి, లేక నా ఇంటికినన్ను పంపించండి. నేను పొందిలి కన్యను అని ఈవిధముగాఅంటూవున్నది— ముందుఏమికానున్నదో తెలియదు—

తుల్సీబాయి రూపవతి సంగీతముకూడావచ్చును. రామరాజేశం రూపవంతుడు ౨౦ సంగీలు గలవాడు పెట్టుకు ముసలిభర్త ఈడు అందాజ ౫౦ కురూపికూడా. ఈసందర్భములో అన్యాయంగా రామరాజేశం శిక్షపొందుతున్నాడు, వెళ్ళగొట్టబడినాడు— ఇట్టిపరిస్థితులబట్టి ఇకముందు ఇటువంటిపెండ్లి కాకుండఉండడమే మంచిది. కానిఎవరువింటారు. శాసనరూపముగా ఆజ్ఞ అయినచో ఈనష్టకష్టములుపుట్టకపోవచ్చును,

---

### వైశ్య యువజన సంఘ ద్వితీయ వార్షికోత్సవము

మానుకోట, ౨౨-౧౨-౧౩౫౦ఫ.

ప్రపంచ క్లిష్టపరిస్థితులేగాక గ్రామ పరిసర ప్రాంతముల తుఫానువరత్తడివల్ల, ఈవారం, వైశ్యయువజనసంఘ పఠనాలయములో వైశ్యయువజనసంఘ ద్వితీయవార్షికోత్సవము శ్రీయుతవందనం వీరభద్రయ్యగారి అధ్యక్షతన నిరాడంబరముగాజరిగెను— నూతన కార్యనిర్వాహకవర్గము రయున్నకోబడెను. అందులో వందనం వీరభద్రం గారు అధ్యక్షులు వంగవీటిరంగయ్యగారు ఉపాధ్యక్షులు. భువనగిరినారాయణగుప్తగారు కార్యదర్శి, యిమకశ్రీరాజయ్యగారు సహాయకార్యదర్శి, మరిగంమంది సభ్యులునుగలరు.

రెండుసంవత్సరములనుండి. ఈ గ్రామవైశ్యుల వైజ్ఞానిక, సాంఘిక, ఆర్థిక, పునాదుల బలపరుచుచు, వైశ్యయువజన సంఘ పఠనాలయమునకై రుతెంతయోసమర్పి కృషిచేయుచున్న శ్రీయుత భువనగిరినారాయణగుప్తగారిని ప్రశంసించుచు, వారికి వైశ్యయువజనసంఘం వైశ్యనుండి. కృతజ్ఞతదెల్పుచు, నూతనఆధ్యక్షులవారుపన్యసించిరి.

---

### ఆంధ్రమహాసభాధ్యక్షులవారి ఆదిలాబాదుజిల్లా పర్యటన

సిరిపురం, అక్టో ౨౨

(ఒకవిలేఖరి)

ని, రా. ఆంధ్రమహాసభాధ్యక్షులగు శ్రీరావి నారాయణరెడ్డిగారు అర్గనైజింగు సెక్రటరీయగు వటికోట ఆళ్వారుస్వామి. పి. రామాచారిగార్లతో ౧౪-౧౨-౫౦ సోమవారమురాత్రిరైలులో హైద్రాబాదునుండి ఆదిలాబాదుజిల్లా పర్యటనకై బయలుదేరి, ఆసిఫాబాదునకుచేరుకొనిరి. ౧౯ అక్టో ౧౩౫౦ఫ బుధవారమునాడు గ్రామప్రముఖులతో ఇష్టగోష్ఠి సమావేశముజరిగెను. ఆదే సందర్భమున, "ఆంధ్రగ్రంథాలయము" స్థాపింపబడెను.దీనికి కార్యనిర్వాహకవర్గమెన్నుకోబడెను.

అధ్యక్షులు శ్రీరామచంద్రరావుగారు
ఉపాధ్యక్షులు విరామారావుగారు
కార్యదర్శి తాటిపెల్లి నాగయ్యగారు
గ్రంథపాలకుడు గుండా విశ్వనాథముగారు
కోశాధ్యక్షులు సిద్దంశెట్టి పోశెట్టిగారు

మరిఐదుగురు కార్యనిర్వాహకసభ్యులును ఎన్నుకొనబడిరి

౨౦-౧౨-౫౦ గురువారమునాడు శ్రీఅధ్యక్షులవారు సపరివారముగా బండిద్వారా గోండుల గ్రామాలకు వెళ్లిరి. అరోజురాత్రివరకు సుమారు రెండువైళ్ళకుపైగా పర్వత, అరణ్యప్రాంతములోనున్న, గతసంవత్సరము కాల్పులుజరిగిన జోడేఘాట్ గ్రామము నకుచేరిరి ౨౧-౧౨-౫౦ శుక్రవారము కాల్పులుజరిగినప్రదేశము, మరియు శవములదహనప్రదేశమును చూచిరి, గోండులతో పరిస్థితులువిచారించి తెలిసికొని భోజనానంతరంతిరిగి సాయంత్రము ౪-౩౦ గంటలకు ఆసిఫాబాదునకుచేరుకొనిరి తిరిగి రాత్రి ౭-౪౫లకు సపరివారముగాబయలుదేరి రాత్రికి సిరిపురంచేరుకొనిరి.

---

### మున్నూరుకాపు సంఘాభివృద్ధిమార్గాలు

హైదరాబాదునగరములో అలియాబాదు మున్నూరుకాపుసంఘ వార్షికోత్సవము ౧౯౪౧ అక్టోబరు ౧ వతేదీనజరిగినపుడు శ్రీబొజ్జంనరసింహులుగారు అధ్యక్షతవహించిరి, వారుపన్యసించుచు, శక్తిసామర్థ్యములలోను దేహారోగ్యమునందునుహీనులైన నేటియువకులుఇప్పటివలె దాడికొకసారి ఆయుధపూజచేయుటతో సంతృప్తిపడక ప్రభుత్వానుమతితో అఖాడాలను స్థాపించవలెననియు, విద్య, ఖేలనములలో పోటీపరీక్షలనేర్పరచి అందువిజయులను సన్మానించవలెననియు సూచించిరి.

మున్నీరు, మనోహర, తోటబలిజ, తెలగలను పేరులు నిలువలేదనియు, కాపుఅనుపేరు మాత్రమే నిలిచెననియు నరసింహులుగారు చెప్పి మున్నూరుకాపులకు పేరు ప్రాచీనమైనదని చెప్పిరి ఇకఈ పేరువిషయమై వివాదము మానిస్వకీయాభివృద్ధికై ఐకమత్యముతో కృషిచేయవలెననిరి. చరిత్రకుసంబంధించిన వివాదాంశములను ఈసారి హైదరాబాదునగరములో జరుగుటకు ఆహ్వానితమైన అఖిలభారత మున్నూరుమహాసభ సమావేశములో ఆలోచింపవచ్చుననిసూచించి. అమహాసభవిజయమునకై చీలికలులేక తోడ్పడవలెననిరి.

తుదకు శ్రీనరసింహులుగారు ఈక్రిందివిజ్ఞప్తితోముగించిరి:

"మనముఆంధ్రులము. మనభాషఆంధ్రభాషయన్నమాట మనము మరువగూడదు, ధనవంతులైనవారు బీదసాదలకష్టపరిస్థితులను గమనించి సహాయము చేయుట తమవిధియనితలంచవలెను. పార్సీలలో ఈపద్ధతిగలదు. వారిలోధనవంతులు బీదవారికితోడ్పడి అర్థికాభివృద్ధికై చేయూతనొసంగెదరు, కాయకష్టమువలన సంపాదించినసంపద ఐశ్వర్యము మనకుటుంబమువరకేగాక సంఘముయొక్క క్షేమమునకై వినియోగించి ప్రజాహితకార్యములను ప్రోత్సహించుటవలనను, మకాణములలో శమాలగుధ గ్రామదాయమును స్వార్థరహితమైన కార్యములకొరకు ఖర్చుచేయుచుండవలెను. అంతేకాని తండ్రితద్దినము అల్లుండ్రసన్మానము. విందులు మొక్కుబడిమాలపైరవి, లాంచములకు ఖర్చుపెట్టుటకు గాదు— యువకులైనవారిపై దేశాభివృద్ధి, సంఘాభివృద్ధి ఆధారపడియున్నవి, వీరుత్యాగబుద్ధితో తమశక్తిసామర్థ్యములను సంఘాభివృద్ధిప్రయత్నములందు వినియోగించినచో మనముభవిష్యత్కాలములోనే వృద్ధిమార్గోన్ముఖులమగుదుము, సత్యము, దయ, స్వార్థత్యాగములతో యువకులు నడుముకట్టుకొని ముందంజవేయవలెనని నేనుప్రార్థించుచున్నాను."

---

రైట్. ఆ. సర్. అక్బర్ హైదరిగారు

వీరు అక్టోబరు౧౨వతేదిన హైదరాబాదునగరమునకువచ్చి మరల వెళ్ళిపోగలరు

---

### శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము

సారస్వతసభలు

విమర్శకాగ్రేసరులును, పురాతత్త్వవిశారదులు బిరుదాంచితులును సుప్రసిద్ధులునగు బ్రహ్మశ్రీ శేషాద్రి రమణ కవులు వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయమున ఈ అక్టోబరునెల ౯, ౯, ౧౦వ తేదీలలో ఈక్రింది కార్యక్రమమనుసరించి ఉపన్యాసములొసగబడును, ఆంధ్రులెల్లరు అమూల్యములును విజ్ఞానప్రదములునగు శ్రీశాస్త్రిగారి ఉపన్యాసములవిని యానందించ నీయవకాశమును గోల్పోవకుందురు గాక!

కార్యక్రమము.

| తేది సమయము | విషయము |
|---|---|
| ౯-౧౦-౪౧ సా॥౭ం. బుధవారము ౬ లకు | ఆంధ్రుల విజ్ఞానము |
| ౯ ౧౦-౪౧ ,, గురువారము | భారతగాథ |
| ౧౦-౧౦-౪౧ ,, శుక్రవారము | విచిత్రభారతము |

అధ్యక్షులు

శ్రీఆచార్య శిరూరి హనుమంతరావుగారు
శ్రీబూర్గుల రామకృష్ణరావుగారు
శ్రీఋక్మ-పట్టణము రామానుజాచార్యులుగారు

ఆంధ్రసోదర సోదరీమణులెల్లరు సకాలమున సభలకుదయచేయ ప్రార్థన.

విధేయుడు,

రావాడ సత్యనారాయణ

సుల్తాన్‌బజారు, హైదరాబాదు (దక్కన్) — గౌరవ కార్యదర్శి.

సభ్యులకుమనవి

మననిలయపు నలుబదవ వార్షికోత్సవము, ఎన్నికలు, కవిసమ్మేళనము ఈఅక్టోబరు ౨౧వతేదినుండిజరుపుటకు నిశ్చయింపబడినది. నిలయమహాజనసభలో తీర్మానములను ప్రవేశపెట్టదలచు సభ్యులు అట్టితీర్మానముల ప్రతిని ౨౦వ తేదీలోపుగ కార్యదర్శికడకు పంపవచ్చును.

---

### కవితాగానము

"పంచవటి" "బృందావన" కావ్యాల విఖ్యాతియు సుప్రసిద్ధకవులుమపండితులునగు బ్రహ్మశ్రీ మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రిగారును శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారును హైద్రాబాదునగరమునకు విచ్చేసినారు, దసరా దినమున మంగళవారం సాయంకాలము నగరములో థియోసాఫికల్‌హాలులో సురవరప్రతాపరెడ్డిగారి అధ్యక్షతలో శ్రీ బుచ్చి సుందరరామశాస్త్రిగారి కవితాగానము ఒకటిన్నరగంటకాలముజరిగెను, వారు తాము రచించియుండిన పద్యాలలోని రమ్యమగు ఘట్టాలను చదివివినిపించిరి-పద్యాలు. ఆనందజనకముగానుండెను.-కొన్ని హాస్యరసముతోనుండిన పద్యాలనుచదివి సభ్యులకదుపుబ్బనవ్వించిరి.-సభకు సుమారు ౧౫౦మంది పండితులు వచ్చియుండిరి.

---

ప్రజారోగ్యసంఘము

హైదరాబాదు[దక్కన్] ప్రజారోగ్య సంఘములో ఈక్రింద ఉదహరింపబడిన సభ్యులను ఎక్కువగా చేర్చినది: —

౧. మౌల్వీ అలియుద్దీన్ అహమదు (మతకు), ౨ మౌల్వీ గులాంమహమ్మద్‌ఖాన్ (సౌరయిగా సంఘాధ్యక్షుడు), 3 నవాబ్‌మహమ్మద్ మాందూర్ ఖాన్ (జాగీర్దారు), ౪. హాకిం నాసిరుద్దీన్ అహమ్మద్‌ఖాన్, ౫. డాక్టర్ అహమ్మద్ అబ్దుల్ అలీం (సహాయారోగ్యాధికారి)

---

వార్షికోత్సవసందర్భమునజరుగు కవిసమ్మేళనమున కవులును, కవయిత్రులును తమతమ కవితాసుంతరులతో పాల్గొని జయప్రదమొనరింతురని ఆశించుచున్నాము.

విధేయుడు,

రావాడ సత్యనారాయణ

గౌరవ కార్యదర్శి.

---



## నోటీసు

బనాం రాచూరు శరణప్ప వల్దు గట్టప్ప సక్న త్రాండూరుజాగీర్ కు యిందుమూలముగా తెలియచేయుటయేమనగా, మీరు నన్ను వివాహమాడి కొన్నాళ్లు సంసారముచేసిన తరువాత సుమారు ౬ సంవత్సరముల క్రిందట నన్ను నాపుట్టింటికిపంపి యింతవరకు ఎన్నిపర్యాయములు కోరినను నన్ను నీవద్దకు తీసుకొనిపోకపోగా నాజీవనోపాధివిషయమైగూడ ఏమియు యింతెజాం చేయకపోతిరి. యింతవరకుమీకు వ్రాసిన రెండు రిజిస్టరు నోటీసులలో ౨ తారీకునాటి నోటీసులో ఎనిమిదిరోజులలోపల మీరువచ్చి నన్ను తీసుకొనిపోనట్లయినచో మరల వివాహము చేసుకొనగలనని తెలిపియుంటిని. ఆఉత్తరమునకుగూడ ఏమియు జవాబులేనందున, యిక నీకునాకు ఏవిధమైన సంబంధములేదని గ్రహించి, ముందునా జీవనోపాధివిషయమై రెండవ వివాహము చేసుకొనుచున్నాను. గనుక యికమీ అభ్యంతరము లేవియు చెల్లనేరవు. మీకు నాకును యికముందు ఎట్టి సంబంధము ఉండజాలదు. దీని ఒకప్రతి గోలకొండపత్రికకు ప్రకటనార్థము పంపనైనది.

కొత్తపల్లి
29-12-50 ఫ.

ఇట్లు
రాచమ్మ - వల్దు రాంపల్లి బసప్ప

## ప్రకటన

ఇందుమూలముగా తెలియజేయుట ఏమనగా నీంకరు నాగూరావు వల్దునరసింగరా అనునాకునీంకరుబ్రదర్సు ఫరం మరియు వ్యవహారముతో సంబంధముండెను. కాని ఇప్పుడు కొన్నికారణములవలన చ॥ ౨౮ మహారేవరు ౧౩౫౦ ఫసలీనాడు వ్రాసుకొనబడినవిభాగపత్రముల ననుసరించి పైజెప్పినఫరం మరియువ్యవహారమునుండి వేరు అయినాను. మరియు ఇచ్చి పుచ్చుకొను మొత్తము జిమ్మేదారినీంకరుబ్రదర్సు మిగతా భాగస్తుల పైననే ఉండును నాకువారితో ఏవిధమైనసంబంధములేదు. ముందువుండబోదు. మరియు ముందువారు చేయబోవు వ్యవహారమునకు నాబాధ్యతఏమివుండదు. నా భద్రతకొరకును అందరికి తెలియుటకొరకు ఈవిషయము గోలకొండపత్రిక మరియు ముషీరు దక్కన్‌లో ప్రకటించనైనది.

ఇట్లు

నీంకరు నాగూరావు
వల్దు. నరసింగరావు

## భరతఖండము అవిభాజ్యము

డా॥ రాధాకుముద ముఖర్జీగారి ఉపన్యాసము
(స్వకీయ విలేఖరి)

మద్రాసు, ౨౭ సెప్టెంబరు

డా॥ రాధాకుముద ముఖర్జీగారు నిన్న సాయంత్రం వై. ఎం. ఐ. ఏ. లో ప్రస్తుతపరిస్థితులనుగూర్చి ప్రసంగించిరి.

**అష్టసూత్రములు**

ముఖర్జీగారు ప్రసంగవశమున ప్రపంచములోని రాజ్యాలలో భారతదేశముయొక్క భావిస్థానమెట్టిదను ఆనేవిషయంమనలందరిని కలవరపెట్టుచున్నది ఈఅష్టసూత్రములను మనదేశమునకు అనుసరింపచేస్తారని చర్చిల్ ఉపన్యాసంవరకు తలచాము. చర్చిల్ ఈఅష్టసూత్రాలు మనదేశమునకు వర్తించవని స్పష్టపరచినారు, మరల ఒక సారి ఆగష్టు ప్రకటనవల్లెవేసిరి. భారతదేశమునకు సామ్రాజ్యాంతరదేశాలతోబాటు సరియైనస్థానమివ్వటము వారిఉద్దేశ్యమట ప్రజలు దీనినినమ్మటకుఎక్కడవారిచర్యలవల్ల అవకాశముకనిపించదు దీనిమాటవదలి ప్రస్తుతవిషయమునకువస్తాను.

**పాకీస్థాన్**

ముస్లింలు, భారతీయులు ఏకజాతిగాదని భారతదేశము ఏకఖండముగాదని అందువల్ల ఏకప్రభుత్వముండుటకువీలులేదని అంటున్నారు. హిందువులు భారతదేశమును ఒకదేవతగ పరిగణించి "దేశమాత"గసేవిస్తువచ్చారు. ఈదేశమాతయొక్క విరాటదేహము కాశ్మీరమునుండి కన్యాకుమారివరకు వ్యాప్తమైయున్నది. రాజకీయముగ పరిపాలనాసౌకర్యమునకు ఆధ్యాత్మికముగ భరతఖండము ఒకఅఖండదేశమని తేలుచున్నది. ప్రతి హిందువుభరతమాతనుప్రార్థిస్తూ సప్తనదులు సింధునదినుండి కావేరివరకు, సప్తపర్వతములు హిమాలయములు మొదలుమలయపర్వతములు, సప్తక్షేత్రాలు హరిద్వారమునుండి కంచివరకు, చెప్పుకుంటాడు.

యిదిభారతదేశము ఏకఖండమని చాటుచున్నది. హిందూదేశానికి హిందూమతమునకు దేహానికి ఆత్మకుగలసంబంధంలాంటిదని రాష్మేస్ మాక్డొనాల్డుగ్రహించాడు.

**హిందూస్థాన్**

భారతదేశమునకు హిందూస్థాన్ అనేపేరును పర్షియాఏకీమినియన్ చక్రవర్తులు బి-సి-ఆరవశతాబ్దములో పెట్టినారు. ప్రతిదేశముసాధారణముగ అక్కడనివసించు హెచ్చుమందిజాతిపేరుతో పిలువబడుతుంది. మనదేశముచుట్టు ఆనేకస్థానులున్నవి

ఉ ఆఫ్ఘనిస్థాన్ బెలూచిస్థాన్ తుర్కిస్థాన్ తుర్కిమనిస్థాన్, అరబిస్థాన్ వారిస్థాన్ ఖైజిస్థాన్, కోహిస్థాన్, కురిస్థాన్, కాఫిల్ స్థాన్, శాకస్థాన్, పాఖిస్తాన్, ఫరిస్థాన్, హెజిస్థాన్లున్నాయి యిన్నిస్థానులుండగ ఎందుచేతన హిందూస్థాన్ అని పిలువబడరాదో తె

## కాంగ్రెసు విశేషములు

గాంధిమహాత్ముని కార్యదర్శి ప్యారిలాల్ గారు అక్టోబరు ౧వ తేదిన వర్ధాసమీపంలో యుద్ధవిద్ధసత్యాగ్రహాంజరిపిఅరెస్టుచేయబడిరి. ఇదిమూడవసారిఅరెస్టు.

అక్టోబరునెలలో ౬ వ తేదిన టంగుటూరుప్రకాశం, బెజవాడగోపాల రెడ్డిగారలు, ౧౬వ తేదిన సి. రాజగోపాలాచారిగారు ౨౫వ తేదిన శాస్త్రీటివిశ్వనాథముగారు, ౩౦వ తేదినకే సంతానంగారు సత్యాగ్రహముచేసినందుకై అనుభవించుచున్న శిక్షలను సమాప్తముచేసుకొని జైలునుండివిడుదలయగుదురని తెలియుచున్నది.

ఈగాంధిజయంతికాలంలో బొంబాయిరాష్ట్రీయజెయిళ్లలో సత్యాగ్రహిఖైదీలు వడికినఖాదీనూలునువారలు గాంధిమహాత్మునికిపంపించుకొనదలచగా బొంబాయిప్రభుత్వమువారు అట్లు గాంధిగారివద్దకుగాని లేకప్రదర్శనముకొఱకుగాని పంపించవీలులేదని ఆజ్ఞాపించినట్లుగా తనకుతెలిసినదని కర్ణాటకరాష్ట్రీకాంగ్రెసు సంఘాధ్యక్షుడు అక్టోబరు ౨వ తేదిన ధార్వారునుండి ఒకప్రకటనచేసినారు.

**సోషలిస్టుల అరెస్టులు**

సయాల్కోటనగరంలో చమన్లాలు, హర్బన్సువాల్, జస్వంత్ సలగ్ ఈఅనుముగ్గురుసోషలిస్టులను సెప్టెంబరు ౨౧వ తేదిన భారతదేశరక్షణనియమాలక్రింద అరెస్టుచేసిరి- వారుఇచ్చినఉపన్యాసములు చేయతగనివట సయాల్కోటకాంగ్రెసు సోషలిస్టుపార్టీకార్యదర్శియు అరెస్టుచేయబడినాడు అదేనగరంలో మజ్లిస్అహరల్వారిఆఫీసునుసోదాచేసి కొన్నిపుస్తకాలనుపోలీసులు తీసుకపోయిరి

లియకున్నది. ముస్లింహిందువులు, క్రిష్టియనుహిందువులనిపిలవటము. పరియనిఅనుకుంటాను పరిపాలనసౌకర్యమునకు ఎన్నివిభాగాలుచేసిన భారతదేశఐక్యతకు భంగమువాటిల్లదు వాటిల్లరాదు.

**ముస్లిములకుహితవు**

ముస్లింలను హిందువులుగ పరిగణించకపోతే వారినిప్రత్యేకజాతిగను. ప్రత్యేకవ్యక్తులుగ తలచితే యూరప్లో యూదులకుపట్టినగతి పట్టవచ్చు. యూదులుఎంతప్రతిభ, ప్రజ్ఞలుకలిగినవారైనా, ఎంతధనవంతులైన ఒ దేశమునునాది అనుకొనకపోవుటవల్ల దేశద్రిమ్మరులై ఎక్కడకు వెళ్లినా అమర్యాదతోను, అసహ్యముగనుచూడబడుచున్నారు కనుక వారురాజకీయంగ వెనుకబడియున్నారు ముస్లింసోదరులు ఈసంగతిని మనస్సునపెట్టుకొని హిందూదేశాన్నినమ్ముకొని హిందూదేశమును చీల్చప్రయత్నములను విరమించవలసినదిగ కోరుచున్నాను అని చెప్పిరి

## సైనికులకు క్రిస్మస్ బహుమతులకై విజ్ఞప్తి

హైదరాబాదు(దక్కన్) అక్టోబరు ౪

మధ్యప్రాచ్యదేశములంగను, ఇరాను, ఇరాఖ్ మలయాదేశములందునున్న ప్రతిసైనికునికిని ఒకక్రిస్మస్బహుమానముపంపుటకై భారతదేశమంతటినుండియు ఒకనిధి వసూలుచేయదలచినారు. చీట్లపేకలు, జాబులువ్రాసికొనుటకు కాగితములు కవరులు, సిగరెట్లు, ఎండించినపండ్లమున్నగువాటిని పెట్టెలలోపెట్టిపంపింతురు. ఒక్కొక్కపెట్టెలో ౬ గురుసైనికులకుసరిపోవు బహుమతులుండును. వీటినిపంచుటలో పదకొండింట పదిపాళ్ళు భారతీయసైనికులకును, ఒకపాలుబ్రిటీషుసైనికులకును అనినిర్ణయించినారు. ఇట్టిబహుమతులుగల ఒక్కొక్కపెట్టెయూ ౧ అణలచేయునట్లుండును.

ఇందులో హైదరాబాదునగరమునుండి౧౦౦౦ పెట్టెలను సికిందరాబాదునగరమునుండి ౨౫౦ పెట్టెలనుపంపించదలచి ప్రజలందరును ఇందుకు సహాయపడవలెనని శ్రీమతులు రెసిడెంటుగారి సతియు, ఘ-న-బరారుయువరాణిగారును విజ్ఞప్తిచేయుచున్నారు. ఈపెట్టెలు ౭౫౦ సైనికులకుపయోగించునట. ఈసారిఅందరును సమమిత్రులకు క్రిస్మస్కార్డులు మున్నగునవి యిమ్మకొనుటమాని, ఆవిధముగ మిగిలెడిధనమును సైనికులకైపంపవలెనని వారుకోరుచున్నారు, హాలీలోగాని కల్హారులోగాని పదిసినూపాయలచొప్పునదానమీయవలెను. ఆమొత్తములను హైదరాబాదు నగరములో, సైఫాబాదురోడ్డుమీద' సైపాన్సు ఆఫీసు కలుపలతున్న "౧౯౪౧ సంవత్సర క్రిస్మసుపేటికలనిధి"యొక్క టెంపొరరీఆఫీసుకు గాని, లేక సికింద్రాబాదులో కె-వి-యం-అస్పత్రిలో రెడ్ క్రాస్ గౌరవకార్యదర్శిపేరగాని పంపించవలెను. పదిరూపాయిలనుపంపించేవారు తనపేరును బ్యాంకులలో గాని, పెద్దఘరములలో గాని, సినిమాలు మున్నగునోట్లగాని దొరకునట్టి ప్రత్యేకముద్రితమైనచీట్లపై సంతకమును చేసి పంపవలెను. ఆచీట్లను పెట్టెలలోనుంచిపంపితురు. పదిరూపాయలకంటె తక్కువమొత్తాలిచ్చువారందరును కలిసి పదిరూపాయలమొత్తాలగునట్లు చేసిపంపవలెను, ౧౯౪౧ అక్టోబరు ౧౫వ తేదివరకు విరాళములు స్వీకరించబడును ఈపెట్టెలను హైదరాబాదు సికింద్రాబాదులలో ఒకస్త్రీలసంఘము వారు ప్యాకింగుమున్నగునవి చేసిపంపించేఏర్పాటుచేసెదరు

ఆఫీసులు, క్లబ్బులు, పాఠశాలలు, కాలేజీలు ఆస్పత్రులుమున్నగుసంస్థలు తమలోనొకరిని ఈపనికైవినియోగించుటమంచిదని శ్రీమతులు సూచించినారు.



## ఆంధ్రమహాసభాధ్యక్షుని ఎన్నిక

మహాసభాధ్యక్షుని ఎన్నికను గూర్చి వచ్చిన జాబులన్నిటిని గుర్తించి సన్మానసంఘమువారు ఏకగ్రీవముగా ఈక్రిందితీర్మానములు చేయుచున్నారు:-

1 రాష్ట్రములోని ఆంధ్రులకును, రాష్ట్రేతరాంధ్రులకు ఆంధ్రమహాసభఒక్కటియే తల్లిసంస్థగానుండదగును గాన ఇప్పుడుమనరాష్ట్రమునందు జరిగిన రాష్ట్రేతరాంధ్రప్రబోధమును, గుర్తించి ఈయేటి ఆంధ్ర మహాసభకు రాష్ట్రేతరాంధ్రనాయకులలో ఒకరిని అధ్యక్షునిగా ఎన్నుకొనుటకు అంగీకరించుచున్నారు.

2 ఆంధ్రమహాసభావస్థయందును, కార్యప్రణాళికయందును రాష్ట్రేతరాంధ్రుల యోగక్షేమము లనుగూర్చి శ్రద్ధవహించిపనిచేయుట కవకాశములుకల్పించి వారికొరకు ప్రత్యేకశాఖ నెలకొల్పవలెనని మహాసభవారిని కోరుచున్నారు.

3 సంవత్సరము పొడుగునను రాష్ట్రమునందు మహాసభ కార్యక్రమము సరిగాజరుపుటకు తగిన నాయకులలో ఒకరిని కార్యనిర్వాహక అధ్యక్షునిగాఏర్పరుచుటకు అధ్యక్షుని కధికారమీయవలయునని మహాసభవారిని కోరుచున్నారు.

4 ఈయేటిమహాసభకు కాశీనివాసులును, రాష్ట్రేతరాంధ్రనాయకులలో అవకాశముగలవారునగు శ్రీ శ్రీ శ్రీ మహారాజకుమార్ సర్. విజయాగారిని అధ్యక్షునిగా నెన్నుకొనుచున్నారు.

5 తక్కిన యుద్ధరభ్యర్థుల సమ్మతిలేకపోవుటచేతను శ్రీ శ్రీ శ్రీ మహారాజకుమార్ సర్, విజయాగారిని అధ్యక్షునిగా ఏకగ్రీవముగా సభ్యులందరను ఎన్నుకొనుటచేతను, వారినిగూర్చి తెచ్చినతీర్మానములు వదలివేయనైనది.

పైతీర్మానమును సంఘాధ్యక్షులుపపాదింపగా శ్రీ కంచర్ల రామబ్రహ్మంగారు బలపరిచినారు

II మహాసభ నవంబరు ౨౨, ౨౩ తేదీలను జరుప నిశ్చయింపనైనది.

III శ్రీ భూపతిరాజు వెంకటపతిరాజు గారు, సి.ఐ.యి, విన్నకోట జగన్నాథగుప్తా గారు యం. యల్ ఏ. శ్రీ గొబ్బూరి రాఘవరావుపంతులు గారు (ఎలమంచిలి) శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు, ఉపసంఘముగాఏర్పడిన ఆంధ్రమహాసభావ్యవస్థనిర్ధపరచి మహాసభవారి ఎదుట పెట్టవలెను.

IV ఆంధ్రజ్యోతి, వీరాభిమన్యు, అను నాటకములను, ప్రదర్శింపజేసివానికగుఖర్చులు సన్మానసంఘమువారు భరించి, అందువలనవచ్చు నికరాదాయమును జమ కట్టవలెను.

V శ్రీ బుద్ధిరాజు శ్రీశైలమల్లిఖార్జునరావు గారిని స్వచ్ఛంద సేవకదళము నేర్పాటుచేయు బాధ్యతవహించ వేడనైనది.

VI ప్రతి సోమవారము సన్మానసంఘము వారు సమావేశముకావలెనని నిశ్చయింపనైనది

**పెట్రోలు వాడుక నియమాలు**

పెట్రోలు వాడుకనియమాల విషయములో హైదరాబాదుప్రభుత్వ ప్రకటనలనుండి ఈ అబాన్ ౨౬వ తేదినను, ౨౭వ తేదినను ఒక్కొక్క ప్రకటన వెడలినది.

పెట్రోలువాడుకకై కొంతకాలమునకు సరిపోవునని తలచి ఇచ్చినఅనుమతి చీటీలలో వాడుకొనబడనివాటిని ఆకాలముపూర్తికాగానే వాపసు యిచ్చివేయవలెనని ప్రభుత్వమువారు కోరియున్నారు, అట్లువాపసుయిచ్చినంతమాత్రాన రెండవసారిఅనుమతించే పెట్రోలు పరిమాణముతగ్గదనియు, వారివారినిజమైనఅవసరములనుబట్టి నిర్ణయించబడుననియు మొదటి ప్రకటనలో తెలుపబడినది

పెట్రోలును విడిగాఅమ్మేవారలు అసలు కంపెనీవారు నిర్ణయించిన ధరకంటె తక్కువకుఅమ్మినచో, వారలకు కంపెనీవారు నిర్ణయించునంతకాలము పెట్రోలుసరఫరా మానివేసెదరు-కొట్టి ఎవరైనఎక్కువధర అడిగినచో అందుకు రసీదును తీసికొని నేరుగాఅపెట్రోలు ఏకంపెనీదోఆకంపెనీవారికిగాని లేక హైదరాబాదుప్రభుత్వపుధరల నిర్ణయసంఘమునకుగాని ఆక్షేపణను తెలుపుచు ఆ రసీదును పంపుకొనవలెనని రెండవ ప్రకటనలో చెప్పబడినది

**హైదరాబాదు స్టేట్ బ్యాంకు**

మ. ఘ. వ. నిజాంప్రభుత్వ సభాధ్యక్షులగు ఛతారీనవాబు గారు ఢిల్లీకిపోయ్యేదానికి ముందు రోజు వారిఅధ్యక్షతన హైదరాబాదుస్టేట్ బ్యాంకును ప్రారంభించేవిషయంలో ఒకసభజరిగెను- నవాబు అఖీల్యార్ జంగ్ బహదర్, నవాబ్ మెహిదీయార్ జంగ్ బహదర్ మున్నగువారలు హాజరైయుండిరి-త్వరలోనే ఈబ్యాంకు ప్రారంభింపబడును.

## హైదరాబాదు బజారు ధరలు

తేది ౩౦-౧౨-౫౦ ఫ.
పల్లా ౧కి ౧౨౦ సేర్లతూకము
ధరలన్నీ హాలీవి.

| బియ్యము | పల్లా ౧కి ధర రూ అ పై |
|---|---|
| కిచిడిసాంబర్లు | ౨౩ నుండి ౨౪ |
| సంబర్లు | ౨౩ ౦ ౦ |
| ఢిల్లీబోగాలు | ౨౨ ౮ ౦ |
| రాంసాగర్లు | ౨౦ ౮ ౦ |
| సానక్రాం | ౨౦ ౪ ౦ కొత్తవి |
| ,, | ౨౨ ౦ ౦ పాతవి |
| అర్కాటి | ౨౦ ౮ ౦ ౨౦ కొతవి |
| ,, | ౨౨ ౮ ౦ పాతవి |
| రోనామణి | ౨౦ నుండి ౧౯ వరకు |
| బుకుములు | ౧౫ ౮ ౦ |
| దేశావరి | ౨౦ ౦ ౦ ౧౮ వరకు |
| **గోధుమలు** | |
| శర్బతి | ౨౧ ౨౦౪ |
| బన్సి | ౨౦ ౦ ౦ ౧౯ వరకు |
| లక్ష్మరీ | ౧౯ ౦ ౦ |
| పోటిరోలా | ౧౮ ౮ ౦ |
| ఎర్రగోధుములు | ౧౮ ౦ ౦ |
| **జొన్నలు** | |
| తెల్ల జొన్నలు | ౧౦ నుండి ౯౪ వరకు |
| పచ్చజొన్నలు | ౮ ౮ ౦ |
| మడికట్లు జొన్నలు | ౮ ౮ ౦ |
| సెనగలు | ౧౬౪ వరకే ౧౬౪ దేశి |
| కందులు యెర్రవి | ౯ ౮ ౦ |
| మినుములు | ౧౨ ౦ ౦ |
| అంకలు | ౧౪ ౪ ౦ |
| సజ్జలు | ౯ ౦ ౦ |
| **పప్పులు** | |
| సెనగ పప్పు | ౨౩ ౦ ౦ |
| కంది ,, | ౧౬ ౮ ౦ |
| పిరిసెనగ ,, | ౨౧ ౨౨ ౮ ౦ |
| లంక ,, | ౧౮ ౧ ౦ |
| మినుప ,, | ౧౮ ౦ ౦ ౧౨౪ |
| పెసర ,, | ౧౯ ౦ ౦ |
| బెల్లము | ౧౫ నుండి ౧౪ వరకు |
| ఉప్పు | ౧౨, ౧౧ ౮ ౦ |
| ఉల్లిగడ్డ | ౧౬ నుండి ౧౭ పాతవి |
| వరుసు మంచిది | ౨, నుండి ౧౨ వరకు |
| **చక్కెర మణుము [౪౦ సేర్లు]** | |
| జావా ,, ,, | ౧౪ ౦ ౦ |
| బొంబాయి ,, | ౧౩ ౧౪ ౦ |
| మద్రాసు ,, ,, | ౧౩ ౧౫ ౦ |
| నిజామాబాదు ,, ,, | ౧౩ ౧౨ ౦ |
| ఎర్రచక్కెర , పల్ల | ౧౩, నుండి ౧౫ వరకు |
| దర్గచక్కెర ,, ౪౦ సే | ౧౬ ౧౨ ౦ |
| ఎల్లిగడ్డ మణుము ౧౨ సే. | ౫ ౮ ౦ |
| అల్లం ,, ,, | ౪ ౧౨ ౦ |
| **మణుము ౧౨ సే** | |
| కొబ్బెరనూనె ,, | ౫ ౧ ౦ |
| కుసుమనూనె ,, | ౫ ౦ ౦ |
| నువ్వులనూనె ,, | ౪ ౦ ౦ |
| వేరు సెంగనూనె ,, | ౩ ౪ ౦ ౩ ౬ ౦ |
| కిరోసిన్ (గ్యాస్) డబ్బా ౧కి | ౪-౧౨-౦ |
| **నెయ్యి మణుము ౪౦ సేర్లు** | |
| బీదరు నెయ్యి ,, | ౬౫ ౦ ౦ |
| తెలంగానా ,, | ౫౫ ౦ ౦ ౫౦ |
| వనస్పతి డబ్బా ౧కి | ౧౧ ౬ ౦ |
| బంగారు తు॥ ౧కి | ౫౦ ౪ ౦ |
| వెండి ౧౦౦ తు | ౭౧ ౪ ౦ |
| ,, తు ౧కి | ౦ ౧౧ ౬ |
| సవరన్ ౧కి హాలీ రూ- | ౩౩ ౮ ౦ |
| **మారకం** | |
| హాలీక కల్దార్లు | ౧౫ ౧౪ ౬ |
| కల్దారుకు హాలీలు | ౧౫ ౧౨ ౬ |
| ఆముదాలు బస్తా | ౯, ౯ ౮ ౦ |
| వేరు సెనగ . | ౫ ౪ ౦ |
| బుడ్డలు పల్లా ౧కి | ౮ ౪ ౦ |
| పప్పు ,, | ౧౨ ౦ ౦ |

గమనిక:-

ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము. అయినను ఏమైన పొరపాట్లుండిన దానికి పత్రిక వారు బాధ్యులుకాజాలరు,

**రేకుడబ్బాలకై విజ్ఞప్తి**

సైనికులకు క్రిస్మస్ బహుమతులను పంపించుటకు ప్యాకింగుచేయుటకై ప్రతివారును తమయిండ్లలో మిగిలియున్న రేకుడబ్బాలను యివ్వవలెనని హైదరాబాదు స్త్రీల యుద్ధసంఘమువారు విన్నపము చేయుచున్నారు, హైదరాబాదు బాలభటులు అక్టోబరు ౬వ తేదినుండి ఈడబ్బాలకొనుటకై యింటింటికి తిరిగెదరు

# ఆంధ్ర రాజ్యాంగ ఆర్థిక (గ్రామ) విజ్ఞానవ్యాపక పరీక్షక మండలి

**పరీక్షాధికారులు**

ప్రొ- మామిడిపూడి వెంకటరంగయ్యపంతులు గా-శే- రామదాసుపంతులు, మా- సత్యనారాయణశాస్త్రి, దిగవల్లి వెంకటశివరావు, రా-మందేశ్వరశర్మ గార్లు-

**కార్యకర్తలు**

ఎమ్.వి.ఆర్. అనవురాచార్యులు, (ప్రొప్రయిటరు) వి-రామకృష్ణరావు బి-ఎ-ఎల్-టిగార్లు కార్యదర్శులు- కె- వి- యస్- అప్పారావు గారు (విద్వాన్) కార్యాలయకార్యదర్శి- కార్యాలయం ప- గో- జిల్లా కొవ్వూరు

**నిబంధనలు**

(౧) రెండు సం॥కు, సరిపడిన పాఠ్య క్రమమేర్పరుపబడెను- ౧౯౪౨ అగస్టునెలవారంలో ప్రథమపరీక్ష జరుగును- రెండవది ౧౯౪౩ సం॥ అగస్టు నెలవారంలో జరుగును- ఇందు మొదటిదానిలో ఉత్తీర్ణులకు "రాజ్యాంగఆర్థిక విజ్ఞానతీర్థ" అనియు, రెండవదానియందు తీర్ణులగువారికి "విశారద" అనియు బిరుదము లీయబడును-

సాధారణంగా ఆంధ్రదేశంలో ప్రతిజిల్లాలోను రెండుకేంద్రములుండవలెను- ఇవిగాక ఏ ప్రాంతములోనయినాసరే ౧౫గురుఅభ్యర్థులు కలిసి ఒకకేంద్రమును కోరినట్లయితే అక్కడకూడా అదనముగా కేంద్రము నిర్ణయింపబడును- ఇట్టి అదనపు కేంద్రమును కోరువారు ౧౫ రూపాయలను ప్రతిరుసుముగా చెల్లించవలెను- ఉపాధ్యాయ లేఖలో గామండలికి తెలుపుకోవలెను-

(౩) పరీక్షకుదరఖాస్తు పత్రములు మొదలగునవి పరీక్షకవర్గమువారు నిర్ణయింతురు- దానిప్రకారము ప్రతిఅభ్యర్థియు ప్రతిసంవత్సరమునను జూన్ ౩౦ తేదీలోగా తనదరఖాస్తును కార్యాలయానికి పంపవలెను- దరఖాస్తుతోపాటు అభ్యర్థి ౩రూ- రుసుముపంపవలెను- హరిజన, మహమ్మదీయ స్త్రీ అభ్యర్థులకు ౧రూ-, మాత్రమే రుసుము నిర్ణయింపబడెను-

(౪) అన్నిప్రశ్నపత్రములకు సమాధానములు తెలుగులోనే వ్రాయవలెను- పారిభాషికపదములు తెలుగులో తెలియకున్న ఆంగ్లపదము నుదహరింపవచ్చును- గ్రాంథికము లేక, సింధ్యము కావాదక భాషను గాని అభ్యర్థి వ్రాయవచ్చును-

**పాఠ్యవిషయములు**

**రాజ్యాంగశాస్త్రము**

(౨) రాజ్యాంగశాస్త్రముయొక్క- సామాన్యసూత్రములు, నవ్యపరిణామములు- భిన్నరాజ్యాంగవిధానములు,- సోవియట్, ఫాసిస్టు ప్రజాస్వామ్య, రాజస్వామ్య, విధానములు,-యిందు ఏకకేంద్రసమాఖ్య- మున్నగురీతులు- తిర్గియిందులోగల భేదములు ఈరాజ్యాంగవిధానముల నిర్మాణముపదవడిక- మానవసంఘ మొత్తముమీద (ఇప్లాముసహా) రాజ్యాంగభావ పరిణామచరిత్ర-

ప్రాచీనభారతదేశరాజ్యాంగ సిద్ధాంతాలు, విధానాల- ప్రస్తుతభారతరాజ్యాంగవిధానము- స్థానికప్రభుత్వము.

**గ్రామసమస్యలు**

రైతువారి జమీందారీవిధానములు వానిచరిత్ర- పరిణామం- గ్రామఋణసమస్య- గ్రామపరిశ్రమలు- ఆరోగ్యము [హరిజనవాడలవిషయములో ప్రత్యేకముగా] గ్రామవిద్య- గ్రంథాలయ, సహకారోద్యమములు- గ్రామప్రజాహితజీవనము గాంధీరత్నం, గ్రామపునర్నిర్మాణం దీనినిగూర్చి ప్రాచ్యవైఖరి- పాశ్చాత్యవైఖరి-

**గ్రామపరిశ్రమలు**

(౪) ఖద్దరుపరిశ్రమ- వేదపురాణ బౌద్ధకాలమునుండి నేటివరకును ఈపరిశ్రమలు ఆయారాష్ట్రములలో పొందిన ఘనతనుగూర్చినవివరములు, ఆయాకాలములలో ఈభారతవస్త్రములు రవాణాచేయబడినప్రదేశములు, దానివిలువ- ౧౯౨౦లో అఖిలభారత చర్ఖాసంఘస్థాపన- వారియాజమాన్యమున నిర్ణయించబడిన ఉత్పత్తివిభాగములు ప్రస్తుతమునదేశములో ఖద్దరు, మిల్లు, బట్టలకు ఉత్పత్తి ఉపయోగంలోగల ఆర్థికనైతికాదిభేదములు- ప్రస్తుతయంత్రమయయుగములో యీదేశములో ఖద్దరుపరిశ్రమ అభివృద్ధికి కారణమేమి? ఇతరపరిశ్రమలగూర్చి క్లుప్తంగా,

గ్రామ- ఆరోగ్యమును సహకారపద్ధతిని గూర్చి సూత్రములు క్లుప్తంగా-

ఈనిబంధనలయందున్నగు వానిలో సవరణచేయుటకు, క్రొత్తవిచేర్చుటకు మండలివారికధికారము కలదు-

**పఠనీయగ్రంథములు**

౧. నేటిభారతరాజ్యాంగము- రా-మందేశ్వరశర్మగారు-పుటలు ౨౨౨- దొరకుస్థలం కొవ్వూరు- ఖరీదు రు ౦-౧౪-

౨. భూమికరములచరిత్ర- మానికొండ సత్యనారాయణశాస్త్రిగారు- పుటలు ౩౦౦- బందరు- కృష్ణా కోఆపరేటివ్ ప్యాంతు ప్రచురణ రు ౧-౪-౦.

౩. సహకార వస్తునిలయోద్యమం- దిగవల్లి వెంకటశివరావుగారు [బెజవాడ] ౨౩౦ పుటలు రు ౧-౦-౦

౪. భారతవస్త్రపరిశ్రమచరిత్ర- రా. మం. శర్మగారు- పుటలు౪౦- కొవ్వూరు- రు ౦-౨-౦

౫ రివెటిల్ మెంటు రైతువారీ భూమిపన్ను విధానము- రా. మం. శర్మగారు- పుటలు ౪౦- కొవ్వూరు- రు ౦-౧౪-౦

౬. జమీందారైతుసమస్య- రా. మం. శర్మగారు-పుటలు౩౯ కొవ్వూరు రు ౦-౪-౦

౭. ప్రకాశంకమిటీ రిపోర్టుసంగ్రహం, ఆం॥ రా॥ జ॥ రైతుసంఘ ప్రచురణ (కొవ్వూరు ప॥ గో॥)- పుటలు౫౦౦ కొవ్వూరు- రు౮-౩-౦

౮. దేశీయపరిశ్రమలు- పెండెం వెంకట్రాములు గారు- పుటలు౨౦౦- పేరాల పయా చీరాల రు ౧-౪-౦

౯. గ్రామము- మా. సత్యనారాయణశాస్త్రి గారు- పుటలు౮౫- బందరు (జాతీయ కళాశాల ప్రచురణ)-

సరా:— ౧ మొదలు ౮వరకుగల పాఠ్యగ్రంథములు అభ్యర్థులకు సగముఖరీదునకు లభించునట్లు ఏర్పాటుచేయబడును. సహాయ గ్రంథములలో ౧, ౨, ౩, ౪ కూడఅర్థమూల్యమునకై యిచ్చింపబడును. ఇందునుగూర్చి అక్టోబరు ౧౫వ తేదీలోగ పత్రికాముఖముగా తెలుపబడును

వివరాలను తెలుసుకొనగోరువారు కే. వి. యస్ అప్పారావుగారు కొవ్వూరు పశ్చిమగోదావరిజిల్లా వ్రాసి తెలుసుకొనుడు-

---

# ఆజ్ఞాధిక్కారియైన హవాల్దారు

చందర్ సింగుఅను హవాల్దారుకు ౧౯౩౦వ సంవత్సరములో అల్లరులసమయమునందు తుపాకి ప్రేల్చవలసినదని ఆజ్ఞనొసగగా అతడుతుపాకి ప్రేల్పనందున సైనికాధికారులతని విచారించి యావజ్జీవద్వీపాంతరవాస శిక్షనువేసిరి అతడులన్ని జిల్లాజెయిలులలో శిక్షననుభవించుచుండి చాలఏండ్లకారాగారవాసము తర్వాత సెప్టెంబరు ౨౬వ తేదిన విడుదలచేయబడినాడు-

---

ఇంతకుముందెప్పుడు తెరపైకెక్కని క్షమార్పణగాథ
వివాహమాడు తాననినమ్మించి అనాథనుగాచేసిన పురుషుని
గౌరవరక్షణకై తనసర్వమును ధారపోసిన త్యాగశీలచరిత్ర.

వాహినీవారి

# దేవత

నటీనటులు:- నాగయ్య, కుమారి సూర్యకుమారి రాజరత్నం మొదలగువారు

డైరక్టరు బి. యన్. రెడ్డి

స్త్రీపురుషులందరు తప్పక చూడతగింది—
తరువాత పశ్చాత్తాపము గతజలసేతుబంధనము

**4వ వారమునడుస్తూంది**

సికింద్రాబాద్ **రాజేశ్వర్ టాకీసులో** ప్రతిదినము ప్రదర్శింపబడుచున్నది

---

# భారతదేశపు సంగతి బ్రిటిషువారికి పట్టలేదు

సైమ్రాయిగారి కార్యనిర్వాహకవర్గమందు ఒకసభ్యుడుగ నియుక్తుడైన డాక్టరుతుమ్మలగుంటి రాఘవేంద్రరావుగారిని విశాఖపట్నములో 'హితవాద' పత్రికయొక్క ప్రతినిధి అడిగినప్రశ్నకు సమాధానముగ వారు భారతదేశపుసంగతి బ్రిటనులో సామాన్యజనులకుగాని, పార్లమెంటుకుగాని కొంచెమైనను యుండలేదనియు, వారలిప్పుడు యుద్ధవిషయముతో ముఖ్యముగా నున్నవారనియు, భారతదేశవిషయములు పార్లమెంటుకామన్సు సభలో చర్చకువచ్చియుండిన అనేకసమయములయందు తానుఆసభకు పోయియుంటిననియు అపుడు ౫౧ మందికంటె ఎక్కువమంది సభకువచ్చియుండెడిదిలేదనియు (కామన్సుసభలో సభ్యులమొత్తముసంఖ్య ౬౧౫) భారతదేశరాజకీయనాయకులుగూడ, డొమినియనులలో రాజకీయనాయకులు యుద్ధవిషయమున గలిగియున్న వైఖరిని గలిగియున్న నేగాని భారతదేశవిషయము పార్లమెంటు కామన్సుసభవారికి కొట్టదనియు చెప్పిరి, సుమారుఒకఅరడజనుమంది సోషలిస్టుసభ్యులు ఆకామన్సుసభలోనున్నారు. వారలు భారతదేశవిషయములయందు ఆదరముగలవారలేకాని మొత్తము ఆంగ్లేయప్రజలలెక్కమీద వారల కట్టిమాటపలుకుబడియులేదని డాక్టరురావుగారు చెప్పిరి.

భారతదేశములో అన్నిపక్షములవారలును ఒప్పుకొన్న రాజ్యాంగమునుగురించిగాని బ్రిటిషుప్రభుత్వముఆలోచించదనిరి- అన్నిపక్షాలవారలును ఒప్పుకొన్నచేగాని స్థిరముగానిలువగల రాజ్యాంగము ఏర్పడజాలదనియు, అవిధముగఅన్నిపక్షాలవారలును ఒప్పుకొనకుండా రాజ్యాంగములో మార్పుచేసినయెడల అదిసరిగా సాగకుండ ఆటంకములుకలుగుచుండునని యు, ప్రజలలో అల్లరులు జరుగుచుండునని యు డాక్టరు రావుగారుచెప్పిరి

---

# భారతదేశమునుగూర్చి అమెరికనుల విచిత్రభావములు

కమలాదేవి ఛటోపాధ్యాయగారి అనుభవము

శ్రీమతికమలాదేవి ఛటోపాధ్యాయగారు ఇటీవల అమెరికాఖండమందంతటను ఆసియాఖండప్రత్యాప్రాంతములను సంచారముచేసి ఇక్కడికితిరిగివచ్చినది. ఆమెను బొంబాయినగరములో "జర్నలిస్టుల అసోసియేషను' వారిభవనములో సెప్టెంబరు ౨౯ వ తేదిసాయంకాలము పత్రికల ప్రతినిధులు కొన్నిప్రశ్నలనువేసిరి వాటికిఆమెసమాధానమిచ్చుచు భారతదేశమునుగూర్చి అమెరికనులకు చాలవిచిత్రములైన అభిప్రాయములుండినట్లుచెప్పినది.

కమలాదేవిగారు పోయినచోటనెల్ల అమెరికనులు ఆమెముఖమును ఫోటోతీయుటకంటె పాదములను ఫోటోతీయుటకైఎక్కువఆత్రముచూపిరట, భారతదేశమనగా పాములను జోస్యములుచెప్పువారలును, ఉష్ణముతో ఎక్కువగానుండు దేశమని అమెరికనులుతలచుచున్నట్లు కమలాదేవిగారికిగోచరించెను, పత్రికలవిలేఖకులేచటువంటిప్రశ్నలను వేసెడివారని కమలాదేవిగారుచెప్పెను. అంతకంటెవిచిత్రమేమనగా, మంచిచదువుకొన్నయువకులును యువతులు తానువీధిలోనడచునప్పుడును, తనకుసన్మానముచేయబడునప్పుడును తనవద్దకుపిల్చి క్షమించవలసినదనిఅడిగి,తమభవిష్యత్తు చెప్పవలసినదని అడిగెడి వారని కమలాదేవిచెప్పెను. ఒకతెలివిగలచిన్నబాలిక కమలాదేవికి చాకొలెట్లు పెట్టి సాముద్రికం చెప్పవలసినదని అడిగెనట.

పాములను, భరింపరానిఉష్ణమున్న అమెరికాలోకొన్నిచోట్ల భారతదేశంలోకంటెఎక్కువయని కమలాదేవిచెప్పెను.

జ్యోతిషాలయములు భారతదేశంలోకంటె అమెరికాలోనే చాలఎక్కువగానుండెనని ఆమెచెప్పెను. అసలుఅమెరికాలో జ్యోతిషవృత్తి ఒకపెద్దపరిశ్రమగానున్నదని చెప్పెను

**సత్యాగ్రహము**

ఇపుడు భారతదేశములో జరుగుచున్న సత్యాగ్రహమునుగురించి అమెరికాకుసరిగా వార్తలనుపోనీయకుండుటవల్లను బ్రిటిషువారలకనుకూలమైన ప్రచారము ఎక్కువగాచేయుటవల్లను, ఆసత్యాగ్రహమునుగురించి అమెరికాప్రజలకు కొద్దిగామాత్రమే తెలిసినట్లు కమలాదేవి తెలిపెను. బ్రిటిషుఅధికారుల కత్తిరి పులబాధలేకుండ సత్యాగ్రహకథనొకదానిని అమెరికాకుచేర్చుటకై అమెరికాపత్రికయొక్క ఒకప్రతినిధి మానిలాదీవికి విమానములోఎగిరిపోయి అక్కడినుండి ఆకథను అమెరికాకుపంపవలసివచ్చినదట యుద్ధమునుగురించి కాంగ్రెసు మొ… టగావించినప్రకటన, ఆ భారతదేశములో మొదట చేయబడిన తర్వాత కొన్నిరోజులతర్వాతగానిచేరలేదు కాని కను … అమెరికనులకు ఆకాంగ్రెసు ప్రకటనసంగతియే తెలియదు. ఈదేశంలో భిన్నములైన తెగలవారలందరును విపరీతముగా పోరాడుచున్నట్లు అమెరికనులకు ప్రచారముచేయబడినది, కావునవారలు దానిని గట్టిగానమ్మినందువల్ల తనకుపలుమారు "అందులో సత్యమేమైనయున్నదా, లేక అదంతయు బ్రిటిషుప్రచారమేనా!" అనిప్రశ్నలడుగబడుచుండెను. అమెరికాలో రాజకీయవ్యవహారములు తెలిసినవారలు భారతదేశంలో ఒక్కటేరాజకీయ సంస్థయున్నదనియు, అదికాంగ్రెసుఅనియునమ్ముచుందురు ముస్లింలీగుఅను మరియొకసంస్థయున్నట్లు కొద్దిమందికిమాత్రమే తెలియును.

బ్రిటిషుప్రభుత్వమువారి సామ్రాజ్యవిధానమును సమర్థించుకొందరికి భారతదేశ విషయములను గూర్చి అమెరికాలోజరిగే సభలలో చాలా చిక్కుగా నుండుట గలదట- ఒకసారి డఫ్ కూపరుగారిని ఆసభలోనివారు అడ్డుప్రశ్నలువేసి బాధించేటప్పటికి డఫ్ కూపరు గారికి చాలాకష్టమయ్యెనట.

అయితే మరి బ్రిటను, అమెరికాయొక్కటి ప్రపంచ సంపదనంతయు యుద్ధానంతరకాలములో పంచుకొని అనుభవించేఎత్తు ఏమైనను రహస్యముగానున్నదా యని పత్రికల ప్రతినిధులు కమలాదేవి గారినడిగిరి- అందుకుకమలాదేవి "అప్రశ్నకు జవాబుచెప్పుట చాలాకష్టమే"ననిచెప్పెను. అయినను అమెరికనులఅనేకులు యీ యుద్ధమునందు ఆసక్తిచూపుచుండుటనుబట్టి తెలివిగల రాజకీయ పరిజ్ఞానులూచనగా కొంత ఊహించవచ్చును-అని ఆమెచెప్పెను

తూర్పుఆసియాఖండ ప్రాంతములో తనఅనుభవములనుగురించి ఆమెచెప్పుచు కొందరుబ్రిటిషు అధికారులు ఆమెసంచారములకు అనేకనిరోధములనుకలిగించిరనియు, తాను నిరాయుధురాలైన సామాన్యస్త్రీయైయుండగనుఅధికారులు ఈవిధముగా భయపడుట తనకుచాల ఆశ్చర్యముకలిగించెననియు, ఒకనావికుడుతనను తమాషాగా "అమ్మా మీరేంచేస్తాయి! మీరుకరుస్తారా! మీచేతులయందు ఏమీలేదుకదా!" అని అడిగెననియు చెప్పెను.

---

# అన్నామలైచెట్టిగారి షష్ట్యబ్దపూర్తి

చిదంబరంలో అన్నామలై విద్యాపీఠమును స్థాపించినట్టి డాక్టర్ రాజాసర్ అన్నామలైచెట్టియార్ గారి షష్ట్యబ్దపూర్త్యుత్సవము సెప్టెంబరు ౨౯వ తేదిన శెట్టినాడు కోటకిగినపుడు ౨౫౦౦౦ మంది మూగవచ్చిరి. అనేకమంది పురోహితులు శాస్త్రోక్తముగ వైదికవిధులను జరిపిరి, దక్షిణదేశపు గొప్పసంగీతవిద్వాంసులు సంగీతమువినిపించిరి.

మదరాసు గవర్నరు, భారతదేశపు ప్రధాన న్యాయమూర్తి సర్ యస్ రాధాకృష్ణన్, సి. ఆర్ రెడ్డిగారలు మున్నగువారలు అభినందన సందేశములను పంపిరి.

---

# గోలకొండపత్రిక

వృషనామ సం॥ర ఆశ్వయుజ బ॥ ౧
సోమవారము


## కూచిపూడి భరతము

నాట్య శాస్త్రము హిందువులలో అతి ప్రాచీనములోనే అభివృద్ధి నొందినట్టి ఉత్తమ కళ. ఇతర శాస్త్రాలను గురించి హిందువు లేవిదముగా సమగ్రముగు శాస్త్రాలను వ్రాసిరో ఆదేవిధముగా నాట్యశాస్త్రమును గురించి ఒకరిద్దరుకాక అనేక విద్వాంసులు ఋషులు, మున్నగు పెద్దలు చాలా గ్రంథాలను శాస్త్రాలను వ్రాసిపెట్టిపోయిరి. బ్రహ్మయే మొట్టమొదట యీ శాస్త్రిన్ని వ్రాసెననియందురు. నాలుగు వేదాలనుండి నాలుగు నాట్యాంశాలను తీసికొని అతడు నాట్య శాస్త్రమును రచించెనట.

> జగ్రాహపాఠ్యం ఋగ్వేదాత్
> సామభ్యో గీతమేవచ
> యజుర్వేదా దభినయాన్
> రసానాథర్వణదాపి.

అట్టి నాట్య శాస్త్రము నాలుగు ఉపవేదములలో ఒకటియై "నాట్యవేదము" అను ప్రఖ్యాతిని పొందెను.

నందికేశ్వరాదులు చాలా మంది నాట్యశాస్త్రిన్ని వ్రాసిరి. మొదట ఇది ౩౬,౦౦౦ గ్రంథముగా నుండెననియు, తర్వాత ౧౨,౦౦౦ దైనదనియు మరల ఇంకను సంక్షిప్తమై ౬,౦౦౦ శ్లోకముల గ్రంథమయ్యెననియు చెప్పబడుచున్నది. ఎందరువ్రాసినను భరతముని ప్రణీతమగు శాస్త్రినికే లోకమందు వ్యాప్తి కలిగెను.

నాట్యము వలని ప్రయోజనములను గురించి భరతమునియే యిట్లు వ్రాసినాడు.

క్వచిద్ధర్మః క్వచిత్క్రీడా క్వచిదర్థః క్వచిచ్ఛమః

"ఇది ధర్మావలంబులకు వృద్ధికరము. కాముకులకు తదర్థకము. శూరులకు ఉత్సాహహేతువు. అజ్ఞానులకు జ్ఞానమిచ్చును. పండితులకు వైదుష్యమును వృద్ధిపొందించును. ధనవంతులకు విలాసహేతువు. దుఃఖితులకు స్థైర్యమిచ్చును. దేనియందైతే నాట్యముకానరాదో అది జ్ఞానముకాదు, శిల్పముకాదు, విద్యకాదు, కళకాదు, యోగమున్నూ కాదు."

అతిప్రాచీనములో రంగస్థల మెట్లుండవలెను, ఇతివృత్త మెట్టిదిగానుండవలెను, అభినయమే రసానికెట్టిదిగా నుండవలెను, ఏభావము నెట్లుప్రకటించవలెను. ఏ వేషము నెట్లుతీర్చి దిద్ది చేసుకొనవలెను- ఈ వివరాలన్నియు పెద్దలు వ్రాసిపెట్టిపోయినారు. ఇతరప్రాంతాలలో ఎట్లోయేమో కాని సుమారు ౬౦౦ సంవత్సరాలనుండి తెనుగు దేశములో యక్షగానాలని ప్రసిద్ధిపొందిన బయలు నాటకాలలోని సాంప్రదాయములను గమనించుచు వచ్చిన పూర్వము వేషాల కేమేమి పరికరాలుపయోగించుచుండిరో, ఏమేమి రంగాలు వాడుచుండిరో తెలియరాగలదు. ఆ వివరణయంతయు వ్రాయబూనిన ఒక చిన్న గ్రంథమే యగును. ముర్దారుసింగును ముఖానికి పట్టించుకొనుచుండిరి. జనుపనారను వెంట్రుకలుగ వాడుచుండిరి. మ్రరిపాలను వెంట్రుకల నతికించుకొను బంకగా వాడుచుండిరి. అర్ధశాన్ని కూడా రంగుకుగాను వాడుచుండిరి. భుజకీర్తులు తగిలించుకొనుచుండిరి. కిరీటము పెట్టుకొనుచుండిరి. ఇట్టియువన్నలెన్నోని పడుచుండిరి. భరత శాస్త్రిన్ని తర్వాతికాలములో మనశాస్త్రకారులు కొందరు నిందించిరి. నటులు అపాంక్తేయులనిఖండించిరి. వారికి సంఘములో గౌరవములేకుండా చేసిరి. ఈసంకుచితదృష్టి ముదిరిన తర్వాతనే హిందువులపతన మారంభమయ్యెను.

పూర్వకాలములో ఉత్తమ బ్రాహ్మణులు, క్షత్రియులు తమ బాలికలకు నాట్యవిద్యను నేర్పించుచుండిరి. అర్జునుడు మంచి నాట్యాచార్యుడు; ఉత్తరకు నాట్యవిద్యను ఒక సంవత్సరములోపలనే నేర్పెను. తర్వాత అది వేశ్యావృత్తికి ప్రత్యేకింపబడిన స్త్రీల హద్దువరకే నిలిచిపోయెను. వారిలోనైనను ఈవిద్య నిలువకపోయెను.

ఆంధ్ర దేశములో "కూచిపూడి భాగవతులు" అను ప్రసిద్ధ నామము కలవారు ఇంచుమించు ౪౦౦ సంవత్సరాలనుండి భరతశాస్త్రిన్ని అభిమానవిద్యగా తుదకు కులవిద్యగా ఏర్పాటుచేసుకొని ఆ శాస్త్రిములో అపారమైన కౌశలముపొంది ఆంధ్రులకు కీర్తి తెచ్చిరి. కాని పాతదంతయు మోటు అయిపోయిన కాలము దాపురించిన తర్వాత దానికిని పతనము వచ్చెను. ఒకదిక్కు సనాతన ఛాందసులు కొన్ని నిషిద్ధశాస్త్రి వచనాల నాధారము చేసుకొని వీరిని తక్కువ దృష్టితో చూచుచునే యుండిరి- అందుకు తోడుగా పాశ్చాత్య విద్యా వివేకులైనవారు "ఇదంతా పుక్కిటి పురాణము, పట్టి మోటుపని" అని ముక్కువిరిచి భుజాలెగవేసి అసహ్యించుకొనిరి. ఈకారణాలచేత కూచిపూడి భాగవతులున్నూ వారి విద్యయున్నూ క్షీణించి పోయెను.

ఇట్టివేళలో కూచిపూడివారి పుణ్యమోఅన్నట్లు వారికి ఒకనాథుడు దొరికెను. "తాండవకృష్ణ" అను నాట్యసంకేత నామమును ధరించిన ఆంధ్ర సోదరుడు, ఎం.ఏ. డిగ్రీ పొందిన విద్యాప్రవీణులు, తెనుగులో మంచి పాండిత్యముకలవారు, వినయవిధేయతలు కలవారు. నాట్యశాస్త్రిమునకు సంపూర్ణముగా తమజీవితము వర్పించినారు. అతిసూక్ష్మ విషయాలనుగూడా పరిశీలించి పరిగ్రహించు నేర్పుకలవారు. శాస్త్రిపరిచయము సంపాదించుకొన్నారు. భారత దేశములో బెంగాలీ, ఓఢ్ర, తెనుగు, మళయాళీ, నాటకాలు ప్రసిద్ధివహించినట్టివి. ఇంచుమించు ఈ నాల్గింటిని తెలుసుకొన్నారు. కథాకళికి ఎక్కువ ఖ్యాతికలదని దానిని బాగా సాధించినారు. కూచిపూడివారిది తమ మాతృభాషకు సంబంధించిన దేయగుటచేత ప్రధానముగా దానిపైవారి కభిమానము గాఢముగానున్నది. కూచిపూడివారి నాట్యము ఏభారతీయ నాట్యమునకు తీసిపోదని వారి యభిప్రాయము.

అన్నిలక్షణాలు సరిగాకూడినవికాని ఒక్కటే ఒక్కటి మాత్రము లోపించి యున్నది. అది ఆంధ్రులలో అభిమానము సన్నగిల్లినదన్న మాట. ఆంధ్రులకు తమ నాజూకంతా మోటు, ఇతరుల మోటంతయు తమకు నాజూకుగా కనబడును. అదొక విచిత్రదృక్పథములో మనముందుము. అందరును అట్టివారని చెప్పము. జనసామాన్య మట్టిదైనది. పైగా ఏతెల్లవాడైన పసందుచేయనిది మనమెట్లు మన నాట్యప్రాశస్త్యమును అంగీకరించవలెను- అనే ధోరణి మనలోచాలామందికి కలదు. "బతాచారి" ఉద్యమమంటే మనవారి కేమో చాలా తెలియునట. "కథాకళి" పేరువింటే మనలో కొందరప్పుడే చిందులు త్రొక్కుతారు. మణిపూరినాట్యమంటే యేమో పరిశోధనలుచేసి వ్రాస్తారు. కాని దివి తాలూకాలోని కూచిపూడి నాట్య మెప్పటిది, ఆ యగ్రహార మిచ్చినవారెవరు, దాని సనదెవ్వరివద్ద నున్నది, ఆ యగ్రహారములో ఎంతకాలమునుండి యీ విద్య వచ్చినది, అనువంశికముగా వారువాడిన రంగులు, వేషాలు, పరికరాలేమిటి- అను విషయాలను పరిశోధించువారు లేరు.

మన తాండవకృష్ణగారిపై యీభారమంతయు ఇప్పుడు పడుచున్నది. వీరు ఉత్సాహవంతులగు యువకులు. ఈ కళకై తమ ఇతరాభివృద్ధులను త్యాగము చేసినవారు. వీరికి ఆంధ్రు లందరున్నూ గాఢమైన ఆదరమును చూపించి సహాయము చేయవలెను. ఎందుకంటే ఇంటగెలిచి రచ్చ గెలువవలసి యుండును.

—

## కరీమాబాదు మద్యపాననిరోధక సంఘము

కరీంనబాద్, ౨౨-౯-౪౧

నిన్నటి సాయంత్రముగరళ్లకు- సయిసంఘమువారు ప్రచారముచేయుచుండగా హలియాబాద్ కల్లుడిపోవారు, మాడుకుండలకల్లు ప్రచారకులపైనపోసినారు- మీప్రచారమువల్ల మాకుకల్లుఅమ్ముటములేదు- అనితిట్టినారు- సంఘకార్యదర్శి వనం వెంకటయ్యగారు యెన్నోవిధముల కల్లుడిపోదారుకు చెప్పినను వినక ఆయనను తిట్టుచూ కొట్టుటకుకూడా ప్రయత్నము చేసినారు- డిపోదారయిన నాగపూరికట్టమల్లుగారి దౌర్జన్యము హెచ్చయి యుండెను- ఇంతలో కార్యదర్శిగారు స్థానిక పోలీసువారికి యితెల్లాయిచ్చినారట ఒక కానిస్టేబిల్ మరియు, పటేలుగారువచ్చి ప్రచారకులను వెళ్లగొట్టినారు- రిపోర్టుచేయుగలమని చెప్పినారు- తెల్లవారిఉపాధ్యక్షులు కార్యదర్శి అమీన్ గారివద్దకుపోయి దరఖాస్తుయివ్వగా అమీన్ గారువచ్చి పంచునామచేసుకొనిపోయినారు- ఫైడిపోదారుయిల్లు, ఆమారాసులోయున్నది- ప్రచారకులను కొట్టగలనని బెదిరిస్తున్నాడు- ప్రచారకులు వరంగల్ లో నౌకరీచేసుకొని రాత్రి ౯గం॥కు. ౧౧ గంటలవరకు యింటికివస్తుంటారు. అందువల్లప్రచారకులు భయముచెందుచున్నారు ఫైడిపోదారుపైన సర్కారువారివిగురాని యుంచగలరని, రెండోసారి, యీ సంఘప్రచారకులకు గోలాటీయిబ్బందులు, కలుగకుండా కేంద్రసంఘమువారు ప్రయత్నములుచేయగలరని ప్రార్థన

—

### శ్రీ హంపీ విరూపాక్షస్వామి

అదిలాబాదుజిల్లా కాగజ్‌నగ్రామంలో తత్పురశిష్యజనులచే ప్రార్థితులై శ్రీశ్రీశ్రీజగద్గురు శంకరాచార్య: హంపీ విరూపాక్షస్వాములవారు ఈవృషనామసంవత్సర ఆశ్వయుజశు౧ు సోమవారము ప్రభృతిశు౧౦ మంగళవారంపర్యంతం- శ్రీదేవీశరన్నవరాత్ర మహోత్సవములు కాంస్యగ్రామమందు జరిపినారు

—

## భారతదేశ రాజ్యాంగమును గూర్చి ప్రశ్నలు

### అమెరీగారి బ్రాడ్ కాస్టు సమాధానములు

భారతదేశప్రసెక్రెటరీఆఫ్‌స్టేటుఅగు అమెరీగారు భారతదేశమునుగురించి అమెరికా సంయుక్తరాష్ట్రములనుండి వేసినకొన్నిప్రశ్నలకు సమాధానములను అమెరికాకును కెనడాకును సెప్టెంబరు ౩౦ వ తేదిన బ్రాడ్‌కాస్టుచేసిరి.

"భారతదేశముయొక్క భావిరాజ్యాంగము ఎట్లుండవలసినదియు, తోటి డొమినియనులవలె సంపూర్ణస్వాతంత్ర్యముపొందుటకు ఇంక ఎంతకాలముపట్టును అనువిషయములు భారతీయుల ఇష్టముప్రకారముండును. యుద్ధము ముగిసినవెంటనే యీ విషయమును విచారించగలమని వాగ్దానమిచ్చియున్నాము ఈలోగా భారతీయనాయకులే ఈవిషయములో పనిచేయుచో మాకుమరీసంతోషమే"నని అమెరీగారుచెప్పిరి. భారతదేశపు సైన్యాధిపతిగారు భారతదేశప్రజలనడుగకయే యిచ్ఛతో భారతదేశముయుద్ధముచేయుచున్నట్లుప్రకటించినదినిజమేనా, అదిప్రజాస్వామికవిధానమేనాయని ఒకరుప్రశ్నించిరి.

అందుకు అమెరీగారిట్లుచెప్పిరి. "సైన్యాధిపతిగారుయుద్ధముప్రకటించలేదు, ప్రకటించియుండలేదు. బ్రిటిషుప్రభుత్వముయుద్ధములో చేరగానే బ్రిటిషు సామ్రాజ్యమందన్ని భాగములును అందులోచేరకతప్పినదికాదు. అమెరికా సంయుక్తరాజ్యముయుద్ధములో చేరగా కేలిఫోర్నియారాష్ట్రము యుద్ధములోచేరినట్లే ఇదియునైయున్నది. కనడావిషయములోకూడ ౧౯౧౪లో ఇదేస్థితి ౧౯౩౯లో భారతదేశమందును ఆదేరాజ్యాంగస్థితి యుండియున్నది- అయినను సైన్యాధిపతిగారునుబ్రిటిష్ఇండియారాష్ట్రిల గవర్నరులును భారతదేశ రాజకీయనాయకులకు జరిగినసంగతులను తెలిపియుంచుటకు అన్నివిధములప్రయత్నించిరి. భారతదేశములో ప్రజాభిప్రాయములో చాలగొప్ప భాగము మొదటినుండియు, నేటికిని బ్రిటిషు ప్రభుత్వము నాజీక్రౌర్యముతోను దురాక్రమణతోను చేయుచున్న పోరాటము నబలపరచుచున్నది. యుద్ధానంతరము భారతీయులు తమకుతగినరాజ్యాంగమునుగురించి ఒక్కమాటను వత్తురనియే నాతలంపు. అట్లువచ్చినతర్వాత, భారతదేశము బ్రిటిషుసామ్రాజ్యములో స్వాతంత్ర్యముకలసమానభాగస్వామిసంపూర్ణముగాఅయిన తర్వాత, దేశమురాజ్యాంగశాసనములలోని అక్షరాలలోనేగాక, వాస్తవములోకూడ తనగొప్పకుసస్థలను తనంతతానేనిర్ణయించుకొనగలుగును

#### అధినివేశప్రతిపత్తి

బ్రిటను భారతదేశమునకు ఇప్పుడుడొమినియన్‌స్టేటసు యెందుకొసగదు! అసలుఒసగవలెనను ఉద్దేశ్యమున్నదా? ఉన్నచో ఎప్పుడుఅనిఒకరుప్రశ్నించిరి- అందుకుఅమెరీగారు క్రిందిసమాధానమిచ్చిరి "౧౯౩౫ సం॥పు శాసనముచే భారతదేశానికి ఫెడరల్ రాజ్యాంగము ఒసగబడెను. దానిప్రకారము ౧౧రాష్ట్రిలలో సామాన్యపౌరునిజీవితమునకు ఎక్కువగాసంబంధించిన అన్నిపరిపాలన విషయాలలోను సంపూర్ణప్రజాస్వామిక ప్రభుత్వపద్ధతి యుండెను. నిజముగాతఃపరిపాలన విషయములు అమెరికారాజ్యాంగముప్రకారము అరాజ్యములలోని రాష్ట్రిముల ప్రభుత్వములవియైయున్నవి. పదికోట్లప్రజలుండు నాలుగురాష్ట్రిము లప్పటికిని ఆదేప్రజాస్వామికరాజ్యాంగము ననుభవించుచున్నవి తక్కినఏడురాష్ట్రిలలోనుకాంగ్రెసుపార్టీయొక్క కేంద్రకార్యనిర్వాహక వర్గము ప్రభుత్వములను సమ్మెచేయుట కాజ్ఞాపించెను అందువల్లఅక్కడగవర్నరులు తామేప్రభుత్వనిధులను చేబట్టవలసివచ్చెను. ఫెడరల్ విధానముకూడ అమలులోకివచ్చియుండినచో భారతదేశపుజాతీయ జీవనమంతటిపైనను భారతీయులకు చాలఎక్కువఅధికారము నొసగియుండెడిది. దానివల్లక్రమముగా సంపూర్ణమైన అధినివేశప్రతిపత్తి (డొమినియన్ స్టేటస్)సిద్ధించియుండెడిది. అదిఅమలుకాలేదు. అందుకుకారణము అనుకొన్న ఫెడరల్ శాసనసభను, ప్రభుత్వమునుస్థాపించుటకు బ్రిటిషువారి అయిష్టముగాక పూర్తిగావేరైయున్నది. అదిఏమనగా, భారతజాతీయజీవనములోనిముఖ్యావయవములన్నియు ఆవిధానముఅమలుజరుపనిరాకరించిరి. కాబట్టిఅమెరికారాజ్యాంగమును స్థాపించినవారలు తమఅవసరములకుతగినట్లు తమ అభిప్రాయములప్రకారము తమరాజ్యాంగమును నిర్మించుకొన్నట్లే భారతీయులను తమలోతాము ఒక్కమాటగాఒప్పుకొని సమాధానపడి తమరాజ్యాంగమును నిర్మించుకొనవలెనని కోరుకొనినాము. అదిఒకపెద్దచిక్కులపని అట్టిదానినిచావు బ్రతుకులపోరాటముయొక్క మధ్యలోచేయ గాలము. ప్రధానసూత్రములవిషయములో ఒప్పందములు దిరియున్నప్పటికిని దానినిప్రుడాలోచించుటకు వీలులేదు'.

అమెరీగారికివేసిన ఇంకొకప్రశ్నయిట్లున్నది- "స్వపరిపాలనకు (హోంరూలుకు) త్రోవచేయు విధానమునకు పండితనెహ్రూగారి అరెస్టుఎట్లుతగియున్నది!" ఇందుకుఅమెరీగారు క్రిందిసమాధానమొసగిరి. "భారతీయులు తమలోతాము సమాధానపడి స్వపరిపాలనసాధించుటను గురించి నేనింతకుముందే చెప్పియున్నాను- దానికిని పండితనెహ్రూగారినిర్బంధమునకును ప్రత్యేకసంబంధమేదియులేదు. వారుభారతదేశపు యుద్ధప్రయత్నమును సరిగాసాగకుండ చేయుటకై కావలెనని ప్రజలలో ఆగ్రహమురెచ్చగొట్టునట్టి తీవ్రములైన ఉపన్యాసములను చేసినందుకై వారికిశిక్షవిధించబడినది వారికిశిక్షవేసినదిశాసనయుక్తమైన న్యాయాధికారులు గాని కార్యనిర్వాహకాధికారులుగాదు. ఇట్టిశాసనధిక్కారములలో తక్కువహోదాలోనివారలే మాత్రమే శాసనకాఠిన్యమును అవలంబింపజేసి సాంఘిక రాజకీయములలో రెండిటిలోనుపండిత నెహ్రూగారియంత పలుకుబడిగ వారిని శిక్షలేకుండరాజద్రోహమును బోధింపనిచ్చుట తక్కువహోదాలోనివారలయెడ న్యాయమేననిమీరుతలంతురా? అది యుద్ధప్రయత్నములకు భక్తితోతోడ్పడుచు, అటువంటిరాజద్రోహచర్యలపై గట్టిచర్యగైకొన్న నాలుగురాష్ట్రిల పరిపాలనవిషయములో ఇప్పటికిని బాధ్యతగలిగియున్న భారతీయప్రజాస్వామిక మంత్రివర్గాలయెడ న్యాయమగునా"

—

### వాహినీవారి "దేవత"

సామాన్యంగా పెద్దలు ఒకమంచి ఇల్లాలును, ఒకగుణవతిని, ఒక అమాయకురాలినిగాని చూస్తే "అబ్బా! మహాఇల్లాలమ్మా, ఆవిడ ఏదేవతలోనో పుట్టవలసినదిగాని సామాన్య స్త్రీ కాదమ్మా" అని మెచ్చుకుంటారు. అంటే ఆ స్త్రీలో ఉండే సుగుణములూ, క్షమయున్న గుణవత్వీ కలిసి ఆమెను ఈలోకంలో సాక్షాత్తు "దేవత"గా చేసినవన్నమాట! దేవతనుగురించి యిట్లాపొడిమాటలతో చెపితే తెలియదనే, "వాహినీ" ఫిలింకంపెనీవారు, ఆటలతో, జిలిబిలి పాటలతో ముద్దుముద్దుమాటలు గట్టునట్లుగా, మంచి కథానన్ని కల్పించి, ఒకఉత్తమ చిత్రాన్ని సిద్ధంచేసి మనకర్పించినారు. అదే "దేవత"

ఇందులో నాయకుడై నటించిన నాగయ్యను ఎరుగని ఆంధ్రుడు గాని తమిళుడుగాని లేరు. నాగయ్య ఉత్తమమైన భావప్రకటనతో తనపాత్రను పోషించుకొని చిత్రానికి మెరుగుపెట్టినాడు- సూర్యకుమారి కిన్నరకంఠాన్ని వినితీరాలి- ఆమె పాటల పులుగు. పలుకుల చిలుక.

ఇక, కుమారినిగూర్చి ప్రత్యేకంగా చెప్పాలి. నిసర్గసిద్ధంగా కుమారి, ఆంధ్రదేవతామూర్తి అనే చెప్పాలి. ఆకారములో ఆమె నటనము, ఉత్తమ లక్షణాలతో మనోహరభావాలతో ఫిలింలోఉన్న చిల్లర లోపాల నన్నిటిని కుడిచివేసినది- కుమారి సౌందర్యోపాసకురాలు. ఆమె ప్రసన్నవదనం గంభీరతనం ప్రేక్షకులను బాగా ఆకర్షిస్తాయి. ఈ చిత్రాన్ని తీసిన వాహినీవారిని గాఢంగా అభినందిస్తున్నాము. తెలుగు చిత్రాలలో ఇప్పటికి చూడదగినచిత్రమిదే అని చెప్పాలి

—

### పరిగణనశాఖ ఉద్యోగుల హడ్తాలు

మ.ఘ.శ. నిజాంప్రభుత్వపు పరిగణనశాఖలోని ఉద్యోగులుకొందరు ఇదివరలో తమశాఖ కమిషనరుగారికి ఒకవిజ్ఞప్తి పంపుకొనియుండిరి-అందులో తమకుంతిజంగారు తమయెడ మాపుచున్న వర్తన సరిగాలేదనియు, ప్రతినెల జీతములతోటె యుద్ధకాలంలో ౧౦రలు హెచ్చివ్వవలెననియు తెలుపుకొనబడెను-ఈ కోరికలనుతీర్చనితీరుకు చర్యగైకొందుమని తెలిపియుండిరి-అదేప్రకారము సెప్టెంబరు ౨౭వ తేదిన ఆఉద్యోగులు హడ్తాలుచేసిరి-వారలు ప్రధానమంత్రిగారివద్దకుపోయి తమకోరికలను తెల్పుకొనిరి- ప్రధానమంత్రిగారు వారలను మొదటపనిలోకి వెళ్లి పనిచేయవలసినదని చెప్పుచు, తర్వాతవారల విజ్ఞప్తినిగురించి విచారించగలమని చెప్పిపంపిరి- అంతటితో ఆఉద్యోగులు వెళ్ళిపోయిరి.

(మ.క్షీ.రవకర్త-ర)

# గ్రామ పునర్నిర్మాణ పద్ధతులు

## ప్రొ॥ యస్. కేశవఅయ్యంగారు గారు ఎం. ఏ.

(ప్రొఫెసర్ యస్. కే. అయ్యంగారు గారు హైద్రాబాదు నిజాంకాలేజిలో అర్థశాస్త్రోపాధ్యాయులు, మైసూరులో అర్థవిచారణచేసియుండిరి. కొలిన్సు గారికాలములో వీరిచే హైద్రాబాదు ప్రభుత్వమువారు హైద్రాబాదు రాష్ట్రములో కొన్నిప్రాంతాలలో అర్థవిచారణ చేయించి ఆయనచే గ్రంథాలు వ్రాయించి ప్రకటించినారు. వీరు బహు గ్రంథకర్తలు— హైద్రాబాదు ఆర్థికస్థితినిగురించి, అభివృద్ధినిగురించి కొన్ని ప్రత్యేక గ్రంథాలు వ్రాసినారు— ఈవ్యాసము హిందూస్థాన్ రెవ్యూలో ఇంగ్లీషులో ప్రకటితమై అనుబంధముగా పునర్ముద్రితమైనది— దాని భాషాంతరీకరణమును చేసి ఇందు ప్రకటించుచున్నాము— గ్రామపునర్నిర్మాణము కేశవయ్యంగారుగారు ఈవ్యాసములను చెప్పినట్లుగా అందరినోళ్లలోను ఈమధ్యఆడుచున్నది—అందరున్నూ దానినిగురించి చర్చించువారే. కాని చాలామందికి వారేమి చెప్పుచున్నారో వారికే తెలియదు—మన దేశసేవకులలో చాలామంది గ్రామ పునర్నిర్మాణమును గురించిన ప్రమాణగ్రంథాలను చదువలేదు—వారు విచ్చలవిడిగా గ్రామపునర్నిర్మాణ సూత్రాలను ఆచరణలో పెట్టలేదు—కావున మన అయ్యంగారు గారు వ్రాసిన యీవ్యాసాన్ని పాఠకులు బాగా శీలించుకొందురుగాక— ఇది చాలా ఉపయుక్తమగు వ్యాసము.

గో. ప. సం—]

దౌర్బల్యము, రోగము, మురికి అవ్యవస్థయు మొదలగునటువంటి అనేక దోషములను తొలగించుటకై ఈదేశమంతటను ప్రయత్నము చేయవలసినదే యను గ్రామపునర్నిర్మాణము అనునది. నేడుపైపై స్థానములకు ఎక్కుడలచిన ప్రభుత్వాధికారియు చోరశక్తిగలవారు, అధర్మసౌధ నివాసియగువిద్యార్థి అందరు సమానముగ కొద్దిరోగాప్పయో ఉద్రేకముతో ఉచ్చరించు పదమైయున్నది. పత్రికలలోను, సభలలోను గ్రామపునర్నిర్మాణమును గురించి నివేదికలు కుప్పలుతిప్పలుగా ప్రకటితములగు చున్నవి. కాని అసలుచేయు చున్న పనిమాత్రము చాలతక్కువ. అందువల్ల ఈపనిలో అనుసరించెడి పద్ధతులను నిర్ణయించుటవల్ల ఈ ఉద్యమమునందు న్యాయముగా ఉండవలసినంత శ్రద్ధలో ఇప్పుడున్న దానికంటె ఎక్కువశ్రద్ధకలుగ వచ్చును.

### గ్రామరాజ్యములు

భారతదేశమందు అతిప్రాచీన కాలమునను మధ్యయుగమందును గ్రామము వ్యవహారములు చిన్నచిన్న ప్రజాస్వామిక రాజ్యములవలె వ్యవహారములవలె ఆగ్రామజనులచేతనే పరిపాలించబడుచుండెను, రోడ్డులను చెఱువులను, గ్రామస్థులందరికిని సమానముగ ఉపయోగించుకొనటకు వారికుండు ప్రదేశములను, అంగడులను, బళ్లను పాలించుటయందు వారలకే అధికారముండెను— కేంద్రప్రభుత్వమునకు గ్రామములో జోక్యము లేకుండెననియే చెప్పవచ్చును. ఇటీవల ఒకఉపన్యాసములో అమీనల్ ముల్క్—సర్ మిర్జా ఇస్మాయిల్ గారు ఇట్లుచెప్పినారు. "ఒకపరిపాలన యుండినా, కాదాయని పరీక్షించుటకు గ్రామాలస్థితి నిరపెడిరాయనంటిది" ఈవిధముగ మాచిన పూర్వపు గ్రామప్రజాస్వామ్యములు చాల శ్రేష్ఠమైనవైయుండెను. మరియు సర్ చార్లస్ మెట్‌కాఫ్‌గారుచెప్పినట్లు, అవి "గ్రామప్రజాస్వామ్యములు మరేదియు నిలువజాలనిచోట్లనెల్ల నిలువగలవని తేలినది. ఒక రాజవంశము తర్వాతమరొకటి వచ్చుచుండినను; హిందువులు, తెలగలాయిలు, మహారాష్ట్రులు సిక్కులు, అంగ్లేయులు ఒకరితరువాతనొకరువరుసగా రాజ్యాధికారము నాక్రమించుచుండెను, —గ్రామప్రజాస్వామ్యము మారినదిలేదు." డాక్టర్ హారాల్డుమాన్ గారు ఒకప్పుడు బొంబాయిలోని దక్కన్ ప్రాంతమునకు సంబంధించిన కొన్ని ప్రాచీనములైన కవిలెకట్టలను ప్రమాణములుగా చూపుచు ఒకప్పుడు గ్రామాధికారులు సాధారణముగా ఇచ్చునంత భూమిపన్ను కంటె తక్కువయిచ్చి మిగిలినదానిని గ్రామమును దోపిడిదొంగలనుండిరక్షించుటకై ఖర్చుచేయబడినదని సమాధానముచెప్పినట్లు తెలిపియున్నారు— వాణిజ్యము, విద్యచక్కగా వృద్ధిచెందినవి ఆనాడు ఇప్పటియున్న ప్రభుత్వశాఖలు గాని, రైలుబాట యొగాని లేకుండ వివాదములలో న్యాయము స్థాపితమగుచుండెను పనులు ఇప్పటికంటె ఎక్కువ అవశ్యముగ జరుగుచుండెను గాని, అంతయుసరియైన పద్ధతి ప్రకారము జరుగుచుండుటవల్ల గ్రామప్రభుత్వములు ఉత్తమములుగా నుండెను

### కేంద్రప్రభుత్వాధికారవు హెచ్చింపు

భారతదేశము బ్రిటిషుసామ్రాజ్యములో చేర్చబడినప్పటినుండి పరిస్థితులుమారినవి. అధికారములన్నియు కేంద్రప్రభుత్వమునకు చేర్పబడినవి, ఇట్లు ఒక్కకేంద్రమునకు లొంగియుండుపరిపాలన చేయగలిగినంతపనిని సమగ్రముగా చేయుచుండెననుట నిస్సంశయమే కాని, ఒకదేశము మాత్రమేగాక ఒకచిన్న ఖండమంతటిదైన ఈదేశములో అంతటను ఉండు గ్రామముల వ్యవహారములన్నిటిని ఇట్టిప్రభుత్వము పరిపాలించగలుగుటకష్టమే. లార్డు హెయిలీగారు చెప్పినట్లుగా "వెంగలాయిలనుండి ఒక్కకేంద్రమునకులొంగి రాజ్యమంతటి పరిపాలనయు జరుగుపద్ధతిని మనకును అవలంబించితిమని, ఇదివరలో చెప్పియున్నాముకాని వారలుదానిని ఎంతవరకుకావలెనని అంతవరకు రబ్బరువలెసాగునట్లు ఉంచుటయేగాక దానిక్యత్నము పక్లుసక్లుగాజంచిరి. కాని మనము శ్రేష్ఠతకై పూర్తిగా పాశ్చాత్యాభిమానప్రేరితులమై, ఆపద్ధతినిమిక్కుటముగా అనుసరించితిమి. ఉదాహరణార్థము గ్రామములో దేశీయపరిపాలనవ్యవస్థనుగాని, న్యాయస్థానమునకుగాని అవకాశమునీయలేదు ఏపరిపాలనపద్ధతి గాని గ్రామములలో దేశీయపరిపాలన వ్యవస్థ యుండుట కట్టిపునాదికంటిదని గ్రహించుటలో విశేషమును మాపితిరి

కొన్ని సంవత్సర దశకములుజరిగిపోగా, గ్రామపరిపాలన వ్యవస్థలుచీకిపోయెను. గ్రామజీవితము హీనమయ్యెను. అంతటను అవ్యవస్థసాధారణమయ్యెను. రోమేశదత్తుగారనినట్లుగా,

"భారతదేశములో బ్రిటిషుప్రభుత్వముశాంతినొసగెనుగాని, సంపదనొసగలేదు. వస్తువులనుచేసెడివారలకు వారివారి పరిశ్రమలునశించెను. కర్షకులుసర్కారము, చీటికిమాటికి మారుచుండునట్టిదియైనను పన్నులభారముక్రిందనలుగుచుఏమియును మిగుల్చుకొనజాలక పోవుచుండిరి...... పూర్వపద్ధతులను తీసివేసినతర్వాత విజయముగా సాగగలపరిపాలనపద్ధతి ఏదిగానిమరొకటి ఏర్పాటుచేయబడలేదు. గ్రామప్రజలు ప్రతినిధులు ఎవరుగాని నేటిపరిపాలనలో తోడ్పడలేదు హిందూప్రభుత్వములును మహమ్మదీయప్రభుత్వములును విశేషములతో శతాబ్దములకరబడి ప్రజలతో నుంచుకొన్నపరిచయము విదేశీయ ప్రభుత్వమునకుండజాలదు"

ఆరోజులలో ఎటువంటిఆక్షేపణగాని చేయబడనంతకాలము పరిస్థితులుసాధారణముగానున్నట్లు భావించబడుచుండెను. అందులో భారతీయగ్రామీణులు హానము సహించియుండెడివారయ్యెను. బాగుచేయుటలేనందువల్ల చెరువులు ఉపయోగములేకుండెకప్పిపోయెను. గడ్డిపొదలుపెరుగుటవలన మలేరియావ్యాపించగలిగెను, బాటలను మరామ్మత్తు శ్రద్ధలేకుండెను, వాణిజ్యమునకు ప్రోత్సాహము లేకుండపోయెను, సాహుకారులవలన ఒత్తిడిచేయుట, నాణ్యములేనిపరిపాలన (అదృశ్యముకాదలేనుకాని ఆచరణమారినది) (బలవంతముచేతనైనను న్యాయముగా ఇష్టమునుంచుటచేతనైనను) కుదుర్చుకొన్న ఒడంబడికలను అమలుపరచుటకై న్యాయస్థానములకు పెట్టినవిధి, వృత్తులనవలంభించుటలో కర్తవ్యశ్రద్ధలేకుండపోవుట ఇవియన్నియుకలిసి జనులు నానాటికి ఎక్కువక్కువ భూములనువదలి పట్టణములకు చేరునట్లుచేసినవి. భూములపైపెరిగిన అప్పుప్రక్యాతిసిద్ధమై ఆస్తిని పాడుచేసెను. క్షామములుమాటిమాటికి వచ్చుటయేగాక, ఒకసారికంటెఒకసారి ఎక్కువకఠోరములుకాదొడగినవి. దానితో భూమిపన్నుఅలవన వచ్చెడిఆదాయముపడిపోయెను. సామ్రాజ్యనిర్మాతలకట్టెడట పట్టణములు, నగరములువృద్ధిచెందినవి, కానిఆధికారులకును గ్రామములకు పరిచయము నానాటికి సన్నగిల్లిపోయినది. మళ్లీ లార్డు హెయిలీగారుచెప్పినట్లు

"గ్రేటుబ్రిటనును సంపన్నముగాచేయుచుండి

౮ వ పేజీ చూడుడు

# ప్రకటన

వేములవాడ ౨౨ ఆబాన్.

వెంకట్రాజంరామయ్య,రామశాస్త్రివారు ఇందుమూలముగా తెలియపరచుటయేమనగా "మాతండ్రియగు రామయ్యావెంకట్రాజంరామశాస్త్రివారు జాగీర్ వేములవాడ తాలూకా సిరిసిల్ల గ్రామస్థులు, వయస్సు ౭౦యేండ్లు కులంబ్రాహ్మణులు" వారు గత ౫ సంవత్సరములనుంచి పిచ్చివారుగా నుండుటచేత వారు మాజాయదాద్ లేక యిస్టేట్ యెవ్వరికన్న యిచ్చివుచ్చిన యెడల దానిని తీసుకున్న వారికి మాజాయదాద్ లేక యిస్టేట్ మీద యేమిహక్కులేక అధికారం వుండబోదు

ఇట్లు

ప్రకటనదారులతరపువకీలు

యమ్. యస్. రణజిత్

బి. ఏ. యల్ యల్. బి.

కాలింయాష్ట, బొంబయి 27-9-41

